# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

*[Part II — Proceedings other than Questions and Answers]*

## OFFICIAL REPORT

---

*Twenty-First Day of the Sixth Session of the*
*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 21st November, 1957*

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS
(SEE PART I)

## RETRENCHMENT OF LABOUR IN PUBLISHING HOUSES OF ANDHRA AREA

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు (నందిగామ) అధ్యక్షా, పాఠ్యగ్రంథ ప్రచురణలను జాతీయం చేదామని నిర్ణయం జరిగిన తరువాత ఆంధ్రప్రదేశములో ఉండే టటువంటి ప్రచురణకర్తలు చాలమంది తమ వ్యతిరేకతను వ్యక్తము చేయడమే కాకుండా ప్రభుత్వ నిర్ణయాన్ని ఆధారంగా చేసుకొని వారి ముద్రణాలయములలోని అనేకమంది కార్మికులను తొలగించుటకు నోటీసులను జారీ చేయడం జరిగింది ఆంధ్ర ప్రాంతములలోని పబ్లిషింగ్ హౌసెస్‌లో పెద్దదైన వెంకట్రామ పవర్ ప్రెస్‌వారు వారివద్ద పనిచేసే 140-160 మంది కార్మికులలో ౬౯ మందికి ఈ విధంగా నోటీసులు జారీచేయడం జరిగింది. అదేవిధంగా తెనాలి, నెల్లూరు, బెజవాడ పట్టణములలోని ప్రెస్ యజమానులు కార్మికులకు నోటీసులు జారీ చేస్తున్నారు ప్రభుత్వము పాఠ్యగ్రంథాలను జాతీయం చేయుటకు చేసిన నిర్ణయానికి వ్యతిరేకంగా ఉద్యమం సాగించే నిమిత్తము వారు ఈ విధంగా ప్రయత్నం చేస్తున్నారు. కాబట్టి దీనినిగురించి ప్రభుత్వంవారు ఏమి

చేయబోతున్నారో వారి పాలసీ ఏమో ఈ పరిస్థితులను అదుపులో పెట్టడానికి ఎట్టి చర్యలు తీసుకుంటున్నారో తెలుపవలసిందిగా కోరుతున్నాను

విద్యాశాఖామంత్రి (శ్రీ ఎన్ బి పి పట్టాభి రామరావు) అధ్యక్షా, పాఠ్య గ్రంథములను జాతీయం చేయాలని ప్రభుత్వం నిశ్చయించిన మాట అందరికి తెలుసు ఆ సంగతి తెలిసిన తరువాత కొంతమంది ప్రచురణ కర్తలు శ్రీ వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు తొందరపడి వారి యాజమాన్యములో ఉన్నటువంటి ముద్రణాలయములలోని కొంతమంది కార్మికులకు నోటీసు యిచ్చారని కూడా నాకు తెలిసినది పాఠ్యగ్రంథముల ప్రచురణను జాతీయం చేయకూడదని చెప్పడానికి శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారి అధ్వర్యాన కొంతమంది ప్రచురణకర్తలు వచ్చారు ప్రభుత్వ అభిప్రాయమేమో నేను వారికి ఎక్స్‌ప్లయిన్ చేసి చెప్పాను ఇప్పుడు జాతీయం చేయడంవల్ల వారివద్ద పనిచేసేవారికి కూడా నష్టము వస్తుందని ప్రచురణ కర్తలు చెప్పారు. అయితే రాష్ట్ర శ్రేయస్సును ప్రజా శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని పాఠ్యగ్రంథములను ప్రచురించుటకు ప్రభుత్వము నిర్ణయము చేసినది అయితే ఈనాటి ప్రచురణ కర్తలకు కొంతటైము యివ్వడానికి అవకాశము కల్పించబడినది ఒకేసారి ఫస్ట్ స్టాండర్డు లగాయితు స్కూలు ఫైనలు వరకు జాతీయం చేయబోవడంలేదు 1958-59 సంవత్సరంలో జాతీయం చేయబోయేవి ఫస్ట్ స్టాండర్ వరకు ఉండే తెలుగు పుస్తకాలు మాత్రమే 1959-60 వ సంవత్సరంలో ఫిఫ్త్ స్టాండర్డ్ వరకు ఉన్న యితర పుస్తకాలు, vi standard లగాయితు సెకండ్ ఫారమ్ వరకు అన్ని గ్రంథాలు జాతీయం చేయడం జరుగుతుంది 3 వ సంవత్సరంలో అంటే 1960-61 లో థర్డ్ ఫారమ్ లగాయితు స్కూలు ఫైనలు వరకు జాతీయం చేయడము జరుగుతుందని చెప్పాను దీనిప్రకారం 3 సంవత్సరముల కాలము ఉన్నదని యింతలో అంత తొందరపడి అందరిని తీసివేయడమనే విషయమై మరొక పర్యాయం యోచన చేయవలసినదని వారికి చెప్పాను. ఐతే వారు ఏ కారణముచేత కార్మికులను తీసివేస్తామని నోటీసులు పంపించారో నేను చెప్పలేను. ఇంతేకాక శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తిగారి ఆధ్వర్యముక్రింద పబ్లిషర్స్ వద్ద పనిచేసేటటువంటి నాన్‌టెక్నికల్ personnel కూడ నా దగ్గరకు వచ్చి ఈ విధముగ తమకందరకు నోటీసులు యిస్తున్నారని-చెప్పారు. ఇటువంటి తగాదాలను తీర్చే విషయంలో ఏ మంత్రిగారికి అధికారము ఉన్నదో వారికి పిటిషన్ పెట్టమని చెప్పాను జాతీయం చేయడం నిశ్చయం అయినది కనుక తొలగింపబడే కార్మికులలో ప్రభుత్వ ఉద్యోగాలకు అర్హత గలిగిన వారందరికి సర్వీస్ కమిషన్ ద్వారా ఉద్యోగం యివ్వడానికి ఏర్పాటు జరుగుతుంది. అయితే క్వాలిఫికేషన్స్ లేకపోయినా కాన్‌వాసర్స్‌క్రింద ఉద్యోగాలు చేస్తున్న

వారికి కూడ ప్రభుత్వ సంస్థలో ఉద్యోగాలు యిచ్చే విషయమై ఆలోచించవలయునని చెప్పారు అది సాధ్యము కాదు జాతీయం చేయడంవంటి సమస్యలు వచ్చినప్పుడు కొంతమందికి నష్టము వచ్చేమాట నిశ్చయమే కాని అందులో అర్హతవుండి ప్రభుత్వ డిపార్టుమెంటులలో వుండడానికి యోగ్యమైన వారందరిని సర్వీస్ కమిషన్ ద్వారా తీసుకొనడానికి ప్రయత్నంచేస్తాను దీనినిబట్టి యిదివరకు సర్వీస్ ఉంటే గణనీయంగా వుంటుంది కాని క్వాలిఫికేషన్సు లేకుండా వున్న వారికి ప్రభుత్వము ఏమి చేయడానికి అవకాశం ఉండదని నేను చెప్పాను వారు కూడ జాతీయం మంచిది కాదని వారి స్వంత అభిప్రాయం క్రింద చెప్పారు అయితే వారు ప్రాతినిధ్యం వహించిన వారి తరపున కాదు అయితే ప్రభుత్వం నిర్ణయం చేసినది కనుక ఆ ప్రకారంగా జరుగుతుందని చెప్పాను శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లుగారు అంతకుముందు మరొకరు ఏలూరు నుంచి ప్రెస్ వర్కర్స్ తరపున వచ్చి రిప్రజంట్ చేశారు ఇద్దరికి కూడ నేను ఒకటే జవాబు చెప్పాను జాతీయం చేయడం నిర్ణయం అయినది అప్పుడే చాలదూరం ప్రొసీడ్ అయినాం దానికోసం ప్రత్యేకంగా ఒక ప్రెస్ పెడుతున్నాము అందుచేత జాతీయం చేయడమా, వద్దా అనే సమస్య రాదు జాతీయం చేసిన తరువాత ఎంతవరకు డిస్‌చార్జ్‌డ్ పీపుల్‌ను తీసుకోవడానికి స్యామవుతుందో అంతమందిని తీసుకోవడానికి ప్రయత్నం చేస్తామని చెప్పాను ఇప్పుడు అదే మనవి చేస్తున్నాను యోగ్యులు, అనుభవజ్ఞులు, ప్రవీణులు, సత్ప్రవర్తన కలిగినటువంటి నిపుణులను పాఠ్యపుస్తకాలు ముద్రించే ప్రభుత్వ ముద్రణాలయములో అవసరమున్నంతవరకు, ఖాళీలు ఉన్నంతవరకు వారిని తీసుకోవడానికి ప్రభుత్వం తప్పకుండా ప్రయత్నం చేస్తుందని మనవిచేశాను అంతకంటె మేము చేయగలిగింది ఏమీ లేదు ఇటువంటి పరిస్థితులలో యింతకన్న యీ విషయంలో ఏమీ చెప్పడానికి కూడ అవకాశములేదని మనవిచేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ శ్రీ బి శ్రీరామమూర్తిగారు వెయ్యిరూపాయల జీతగాళ్ళను గురించి అరగంట చర్చకు అవకాశం యివ్వవలసిందని అన్నారు. అయితే అది యివ్వదలచుకోలేదు. ఇది ఎప్పుడు వస్తున్నదే బడ్జెట్ సందర్భంలో వస్తున్నది రిట్రెంచ్‌మెంట్ క్వశ్చన్ సందర్భంలో వస్తున్నది ఇది రోజూ వచ్చేదే కాని దీనిలో స్పెషల్ నేచర్ ఏదీలేదు అందువల్ల దీనిని నేను డిస్‌ఎలౌ చేస్తున్నాను.

శ్రీ బి శ్రీరామమూర్తి (విజయనగరం) ప్రశ్నలసమయంలో ఒక ప్రశ్న వచ్చింది ఆ ప్రశ్నమీద అరగంట చర్చ జరపడానికి మన రూల్సులో అవకాశం ఉన్నది. బడ్జెట్ సందర్భంలో దీనినిగురించి చర్చ చేయవచ్చుననే విషయం వేఱు.

లకు సమస్యలను గురించి బడ్జెట్ సందర్భంలో చర్చించవచ్చు రూల్సులో ఒక గంట చర్చకు అవకాశం ఉన్నది కాబట్టి అందుకు సమయము ఇవ్వకోరుతాను

మిస్టర్ స్పీకర్ . ఈ విషయంలో నిర్ణయం చేయడానికి స్పీకర్‌కు డిస్క్రిషన్ ఉన్నది అందువల్ల ఈ విషయం అంత ప్రత్యేకమైనది కాదని త్రోసి వేస్తున్నాను

## ADJOURNMENT MOTION RE LABOUR STRIKE IN OSMANIA UNIVERSITY

మిస్టర్ స్పీకర్ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పనిచేసే రెండు వేల మంది కార్మికులు స్ట్రయిక్ చేయడానికి ప్రయత్నం చేస్తున్నారనేదానిని గురించి ఒక నోటీసు వచ్చినది దానిని గురించి రేపు ఆలోచించుకుందాము

* శ్రీ పి నరసింగరావు (హుజూరాబాద్ - జనరల్) ఈ విషయమై పిటిషన్ సబ్‌మిట్ చేస్తామని తమతో మనవిచేసుకున్నాను ఆ పిటిషన్‌ను రేపు సబ్‌మిట్ చేయమంటారా ? ఇవ్వాళ అవకాశం యిస్తారా ?

*Mr Speaker* If I allow the adjournment motion then I shall take the petition If I do not allow the adjournment motion I am not going to take the petition. There must be a motion before the House

* ఎస్. బి. పి పట్టాభిరామారావు అధ్యక్షా, ఉస్మానియా విశ్వవిద్యాలయము అటోనమస్ యూనిట్ కాబట్టి డైరక్టుగా గాని, ఇన్‌డైరక్టుగా గాని వారి పరిపాలనలో జోక్యము కలుగజేసుకోవడం సాంప్రదాయసిద్ధమైన పని కాదు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన కార్మికులు కొందరు స్ట్రయిక్ నోటీసు యిచ్చారని, స్ట్రయిక్ చేయడానికి ప్రయత్నం చేస్తున్నారని గౌరవ సభ్యులు చెప్పారు. ప్రభుత్వ ఉద్యోగస్తులకు యిచ్చేటట్లుగా వారికి డి.ఎ వగైరాలు ఉన్నాయి కనుక, లీవ్ రూల్సు సమానముగా ఉన్నాయి కనుక వారికి కూడ 6 రూ-ల కరువుభత్యము అదనముగా యివ్వాలని ఒక రిప్రెజెంటేషన్ పంపించినట్లుగా వైస్‌ఛాన్సలర్ గారు 1957వ సంవత్సరము జూలై నెల ఆఖరువారములో చెప్పారు దానికి సాలీనా 126 వేల రూపాయల ఖర్చు అవుతుందని, ఆ గ్రాంటు ప్రభుత్వము యిస్తేనే తప్ప యివ్వగలిగిన పరిస్థితులలో లేమని వారు చెప్పారు ప్రభుత్వము యివ్వగలిగిన గ్రాంటు ఉన్న పరిస్థితులలో ఉదారంగానే అన్ని విశ్వవిద్యాలయాలకు యివ్వడం జరిగింది.

అయితే ఈ రూ 6-0 0 లు (D A) ఎవరెవరికి యిచ్చుటకు కేంద్రప్రభుత్వం అంగీకరించినదో, ఆ విషయం యిదివరకే గౌరవ సభ్యులకు చెప్పబడినది. అయినా తిరిగి ఒకసారి మనవి చేస్తున్నాను.

To the employees of the State Government, local bodies and also Government industrial and commercial undertakings and aided school teachers whose existing emoluments do not exceed Rs 100 per month, i e Pay plus D A

వాళ్ళకు యిచ్చుటకు మాత్రం. ప్రభుత్వం అంగీకరించినది ముఖ్యంగా, యిందులోఉన్న సూత్రం నూరు రూపాయలలోపు జీతంవారికి రు 6-0-0 లు అలవెన్సు యిస్తే, అందులో సగము భరించుటకు కేంద్ర ప్రభుత్వంవారు ఒప్పుకున్నారు ఏ ఏ categories వారికి, కేంద్రప్రభుత్వం యిచ్చుటకు అంగీకరించినదో, వారికిమాత్రమే రాష్ట్రప్రభుత్వం కూడ యిస్తుంది ఈ యూనివర్సిటీలో పనిచేసే non-gezetted staff కు గాని, clase 4 servants కు గాని, ఆ నిబంధన వర్తించేటట్లు కనబడుటలేదు, ఆ విషయం వైస్-ఛాన్స్‌లర్ గారు మా దృష్టికి తీసుకురాగానే, మా మంత్రివర్గం సమావేశంలో discuss చేసి కేంద్రప్రభుత్వమునకు represent చేశాము ఈ వర్గాలవారికికూడ యివ్వటం న్యాయమని చెప్పాము కాని కేంద్రప్రభుత్వము వారు దానికి అంగీకరించ లేదు కేంద్ర ప్రభుత్వంవారు సగము అలవెన్సు భరించుటకు అంగీకరించని వర్గాలకు, యీ ప్రభుత్వంకూడ యివ్వటంలేదు అందువలన ఈ యూనివర్సిటీవారికి యివ్వటం కూడ సాధ్యంకాదు ధనలోపంచేత యీ ప్రభుత్వం యివ్వటానికి వీలు కావటం లేదు కాబట్టి పరిస్థితులన్నీ గ్రహించినటువంటివారే srike చేస్తున్నారంటే దానికి ప్రత్యేకంగా నేను చెప్పేది ఏమీలేదు ఇప్పుడు యీ విషయం అర్జెంటూ కాదు, డేంజరస్ కూడా కాదు నేను తెలియజేసినట్లు ముఖ్యముగా యీ యూనివర్సిటీ autonomous body. ఆ విషయంలో ప్రభుత్వం జోక్యంకలుగజేసుకొనుట సరైన పద్ధతికాదని, యీ adjournment motion ను అధ్యక్షులవారు admit చేయవద్దని నేను ప్రార్థిస్తున్నాను

*Mr Speaker* University is an autonomous body It is they that are responsible to satisfy their employees. Government only gives grants according to its own discretion Therefore, it does not come under the direct responsibility of the Government Hence, I disallow the adjournment motion.

శ్రీ పి. నరసింగరావు అధ్యక్షా, అది autonomous body అనటం సరైనది కాదు. నిన్న ఛేంబరులో వచ్చి తమతో మనవి చేశాము అటువంటి అవకాశం యిస్తామన్నారు

*Mr Speaker* No more discussion Order, order

*శ్రీ బి రత్నసభాపతి (బద్వేల్) అధ్యక్షా, point of order, Sir నిన్న ప్రొద్దున నరసింగరావుగారు ఛేంబరులో తమవద్దకు వచ్చినప్పుడు ఆ పిటిషన్ విషయమై తీసుకొంటామని తమరు ఖచ్చితంగా చెప్పారు

మిస్టర్ స్పీకర్ నేను చెప్పలేదు ఇవ్వాళ ప్రొద్దున వారు వచ్చారు ఆ పిటిషన్ యిచ్చేటట్లయితే ఫలాని విధంగా వ్రాయాలని చెప్పానుగాని, దానిని నేను examine చేయకుండా తీసుకొంటానని చెప్పినట్లు ఆ సభ్యులు అనడం తప్పు పిటిషన్ ఇవ్వటానికి హక్కు ఉన్నదని, వారు వ్రాసి తీసుకురావాలనిచెప్పారు ఇవ్వాళ తీసుకువచ్చారు Motion లేనిదే వల్లకాదని చెప్పాను Motion లేదు కనుక అది వీలుకాదు Ruling యిచ్చాను కనుక అది close అయినది

శ్రీ బి శ్రీరామమూర్తి On a point of order, Sir, మంత్రిగారు మాట్లాడుతూ, యిది అర్జెంటూ కాదు, dangerous కూడ కాదు అన్నారు

మిస్టర్ స్పీకర్ ఆ విషయం యిప్పుడు అవసరంలేదు

I have not given my decision on the question of danger or urgency

ఆ labour ఏమవుతుంది ? Strike వల్ల వచ్చే consequences ఏమిటి ? ఆ విషయాలన్నీ యిప్పుడు కాదు

The question is I have given my ruling on the autonomous nature of the University. The workers are not the direct employees of the Government and therefore no adjournment motion in this regard lies

* శ్రీ బి. రత్నసభాపతి : అధ్యక్షా, మీరు నిన్న మా ప్రతినిధులతో మాట్లాడిన విషయాలు ఉన్నాయి మేము యిక్కడ దీనిని గురించి ఏమీ చెప్పుకొనుటకు అవకాశంలేకుండా మీరు రూలింగ్ యిచ్చారు. నిన్న 1800 మంది demonstrate చేయటం, strike చేయటం, ఊరంతా తిరగడం జరిగింది వారి grievances ఏమిటో చెప్పుటకు అవకాశం లేకుండా చేస్తున్నారు అది కాకుండా యూనివర్సిటీ autonomous body అనే విషయంమీద కూడ చాలా discussion జరగాలి గవర్నమెంట్ యొక్క commitments కూడ ఉన్నవి వాటిని గురించి

చెప్పుటకు అవకాశం లేకుండా మీరు ruling యిచ్చారు మీ రిచ్చిన రూలింగ్ సరిగా లేదని protest చేస్తూ walk-out చేస్తున్నాము

*[The members of the Socialist Party then walked out of the House]*

*శ్రీ యల్ లక్ష్మణదాసు (పాతపట్నం-జనరల్) On a point of order, Sir, వారు walk-out చేయవచ్చును గాని, యీ హౌసు యొక్క dignity విషయం కూడ చూడాలి స్పీకరుగారు రూలింగ్ యిచ్చిన తరువాత, దానిమీద discuss చేయుట భావ్యముగా లేదని, దానిమీద ruling యివ్వాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ వారు డిస్కస్ చేయిలేదు

They wanted to say something, and I did not allow it Therfore they are walking out

శ్రీ బసవ మానయ్య (ఆంధోల్) అధ్యక్షా, ఈ పరిస్థితిపై యిండిపెండెంటు పక్షమునుంచి మేముకూడ walk-out చేస్తున్నాము

మిస్టర్ స్పీకర్ అది మీ లీడరు చెప్పాలి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) అధ్యక్షా, మేము కూడ walk-out చేస్తున్నాము

*[Two members of the Independent Group then walked out of the House]*

శ్రీ యన్. వెంకయ్య (అద్దంకి). ఈ సమావేశం ఏ తేదీన ఖచ్చితంగా ముగిస్తారో తెలియజేయ గోర్తాను

మిస్టర్ స్పీకర్ 22 వ తేదీ షుమారు 1 గంటకు ముగుస్తుంది

శ్రీ ఎస్. కాశిరెడ్డి (పోదిలి) రూలు 74 క్రింద ఒక మోషన్ ఇచ్చాను. అది యెప్పుడు వస్తుంది?

మిస్టర్ స్పీకర్ · రేపు చూద్దాము

## THE ANDHRA PRADESH COMMERCIAL CROPS (ASSESSMENT) BILL, 1957

శ్రీ పి. సత్యనారాయణ (సామర్లకోట) అధ్యక్షా, వాణిజ్యపంటలమీద పన్నులవిషయంలో ప్రధానమైన అభిప్రాయభేదాలు exemption & gradation విషయంలో ఉన్నవని మనవిచేశాను మన ఆంధ్రప్రదేశ్‌లో అందాజు అంకెల ప్రకారం 2½ ఎకరాలలోపు ఉన్న కమతాలు 40 లక్షల కమతాలు, 27 లక్షల ఎకరాల భూమి ఉన్నదని, 10 ఎకరాలపైన ఉన్న కమతాలు, 2 లక్షల కమతాలు—41 లక్షల ఎకరాలు ఉన్నదని మనకు తెలియుచున్నది అందుచేత ఈ ప్రభుత్వ పన్నులవిధానం చూస్తే 4 గురు పెద్ద భూస్వాములకు ఉన్నంత పలుకుబడి 400 మంది చిన్న వ్యవసాయదారులకు లేనట్లు స్పష్టంగా కనపడుతున్నది ఉదాహరణకు చెరుకువ్యవసాయం తీసుకుంటే నేనువుండే తాలూకాలో రెండు పంచదారమిల్లులు ఉన్నవి ఒక ఎకరం చెరుకుపంట వేస్తే అందాజుగా రు 500 లు వస్తుందనుకుంటే, అందులో రు 200 లు ఖర్చులక్రింద పోతే సంవత్సరమునకు రు 300 లు నికరాదాయం వస్తుంది ఆ రు 300 లలో తమ కుటుంబాల్ని పోషించుకొనలేని చిన్నరైతులు నూటికి 60 మంది వరకు ఉన్నారు కాని వారిమీదకూడ, కొంచమైనా మినహాయించకుండా పన్ను వేస్తున్నాము అదేప్రాంతంలో 50 ఎకరాలు చెరుకు వేసి, కోటాలు సంపాదించిన ఒకేరైతుకు యీ లెక్కవేస్తే అతనికి సాలీనా రు 25000 లు గ్రాస్ఆదాయం వస్తే, అందులో 10 వేలు ఖర్చులుపోతే, నికరాదాయం రు. 15000 లు ఒక కుటుంబానికి మిగులుతున్నాయి. అటువంటివారు పన్నులు చెల్లించగలరు వీరి చేతులలో నూటికి 70 వంతులు భూమి ఉన్నది అందువల్ల వీరిమీద ఎక్కువపన్ను వేస్తే అనుకున్నంత డబ్బురాదని శ్రీ వెంకటరావుగారు చేసేవాదన ఎంతమాత్రం సబబైనదికాదు ఎకరాలను పురస్కరించుకొని గ్రేడెడ్‌వారీగా పన్ను వేస్తే, ప్రభుత్వానికి తప్పకుండా ఎక్కువ ఆదాయం వస్తుంది అట్లా, గ్రేడెడ్‌టాక్సు వేయకపోతే ప్రభుత్వానికి విపరీతంగా నష్టం వస్తుంది

చెరకు విషయం చెబుతాను చెరకు విషయంలో, బెల్లంచేసే రైతును, మిల్లుకు తోలేరైతును ఒకేకాడికి కట్టడం న్యాయమైన విషయంకాదు నేను ఉన్న (రెండు మిల్లుల) ప్రాంతములో 5 ఎకరాల చెరకు పండించే ఆసామి ఏ కారణంచేతనైనా సకాలంలో తాను మిల్లుదగ్గర కోటా సంపాదించుకోలేక అవస్థపడుతూంటే, ఆ కోటాను వెయ్యి రూపాయలకు బ్లాక్‌మార్కెట్‌లో అమ్మే దొంగబజారు వ్యాపారం అక్కడ జరుగుతోంది ఆ ఆసామి చెరకును బెల్లంగా తయారుచేసుకొంటే, అనేక ప్రమాదాలకు గురికావటం, పంచదార చెరకుకంటె చాలా తక్కువలాభం రావటం మనం స్పష్టంగా చూస్తున్నాము.

అందుచేత షెడ్యూల్‌లో మిల్లుకుతోలే చెరకుకు వేసే పన్నులో సగానికన్నా తక్కువరేటున, బెల్లంచేసే చెరకుకు పన్ను విధించటం న్యాయం

సాధారణంగా ఎక్కువ నీటివసరులు ఉండే ప్రదేశంలో అరటితోటలు వేస్తారు మా తూర్పుగోదావరి జిల్లాలో మంచి డెల్టాభూమి ఉన్నమాట వాస్తవమే అందుచేత అక్కడ అరటితోటలు పెంచటానికి మంచి అవకాశాలు ఉన్నమాట కూడ వాస్తవమే కాని, గోదావరి ఇరిగేషన్‌స్కీము తయారు చేసినటువంటి కాటన్, మడికి నీరుతోడటం ఎల్లాగో, ప్లాను వేశారేగాని, డ్రయినేజికి సంబంధించిన భాగం వారు ఊహించలేదు నేటివరకు ఆ డ్రయినేజికి సంబంధించి, ప్లాను వేయులేదు, ఆ డ్రయినేజి స్కీము అమలుపరచలేదు డ్రయినేజి లేకపోవటంవల్ల, అధిక ప్రమాదానికి గురిఅయ్యే పంట, యీ అరటిపంట ఈ అరటి చాలా డెలికేట్‌పంట కాబట్టి, దీనికి ఏదైనా డేమేజ్ వచ్చినపుడు, పూర్తి రెమిషన్ ఇవ్వవలసి ఉంటుందన్నది ప్రభుత్వం గుర్తించవలసి ఉన్నది అంతేకాదు పట్టణాలకు సమీపంలో ఉన్న చిన్నచిన్న గ్రామాలలో ఉండే చిన్నరైతులు అరటి అరఎకరం, ఎకరంలో వేసుకొని జీవిస్తున్నారు ఆపంటలు ప్రమాదానికి గురిఅయినపుడు, ఎక్కువ ఎకరాలలో పండించుకొనేవారికి ఉండే స్థోమత అటువంటి చిన్నరైతులకు ఉండదు కాబట్టి, తప్పకుండా వాళ్లను యీ పన్నునుంచి మినహాయించవలసి ఉంటుంది కనీసం 50 సెంట్లు ఉన్న వారికైనా మినహాయించమని మేము కోరుతున్నాము,

కొబ్బరికాయలు గురించి చెబుతాను రెవిన్యూమంత్రిగారి స్వంత తాలూకా అయిన (అమలాపురం) కోనసీమ ప్రాంతంలో కొబ్బరికాయలు చాలా జాస్తీగా ఉన్నాయి అక్కడ కొబ్బరికాయలను పండించుకొనే చిన్న రైతులయొక్క ఇబ్బందులను నేను మంత్రిగారిదృష్టికి తీసుకువస్తున్నాను వారి ఇబ్బందులు మంత్రిగారికి తెలియనివికావు వారి ఇబ్బందులను మంత్రిగారు సానుభూతితో ఆలోచించి, వాటి నివారణకు వీలైనరీతిగా యీ బిల్లులో సవరణలు తీసుకురావాలని కోరుతున్నాను సాధారణంగా ఒక చిన్నరైతుకు 20 సెంట్ల భూమి ఉన్నట్లయితే అందులో 5 సెంట్ల భూమిలో చిన్న పూరికొంప వేసుకొని, దానిచుట్టూ కొబ్బరిచెట్లు వేసుకొని, జీవించటం మొదలుపెడతాడు 'పదిసెంట్లు భూమిగలవారిని మాత్రమే మినహాయిస్తాము, అంతకుమించి ఉన్నవారిమీద టాక్సు వేస్తాము' అన్నటువంటిది ఎంతమాత్రం న్యాయమైన సిద్ధాంతం కాదు. ఒకరైతుకు 15 సెంట్లు ఉంటే, అందులో 5 సెంట్లు అతనిగుడిసె ఆక్రమించుకోవటం అవుతుంది. కాని కరణంగారు "ఇది మొత్తం 15 సెంట్లు ఉన్నది

కనుక, నీమీదకూడ పన్ను పడుతుంది" అని చెబుతారు ఆ ధోరణిలో ప్రభుత్వ యంత్రం నడుస్తుంది కాబట్టి ఒక ఎకరం కొబ్బరితోట ఉన్నవారిని మినహా యించటం సబబుఅయిన విషయమని మనవిచేస్తున్నాను కొబ్బరిమొక్క వేసిన ఏడు సంవత్సరాలు తర్వాత, ఎనిమిదవ సంవత్సరంలో పంట చేతికి అందు తుంది చిన్న రైతాంగం ఏడు సంవత్సరాలు పన్ను చెల్లించటం చాలా కష్టం మొదటి ఏడుసంవత్సరాలు పన్ను మినహాయించి, తరువాత సంవత్సరాలలో పన్ను విధించటం మంచిదని మనవిచేస్తున్నాను ఈ ఏడుసంవత్సరాలు కొబ్బరి, అరటి, యీ రెండుపంటలు, ఒకేసారి వేయటం అక్కడ రివాజుగా ఉన్నది. అప్పుడు కొబ్బరి శాశ్వతమైన పంట అవుతుంది అరటి శాశ్వతమైన పంటకాదు కాని ఏది ఎక్కువైతే ఆ రేటు వేస్తామని అనటంవల్ల, అరటిపంటకు వేసేపన్ను ఆ మొత్తం భూమికి వేస్తారు. ఇవాళ ఉండి రేపు పోయే అరటి పంటకున్న రేటులో పన్ను వేస్తారు, శాశ్వతంగా ఉండే కొబ్బరిని లెక్కలోకి తీసుకోరు. కాబట్టి, ఇటువంటి మిక్సెడ్ క్రాప్స్ వేసినపుడు, ఏది దీర్ఘకాలికమైన పంటో, అది లెక్కలోనికి తీసుకొని, దానిమీద పన్ను వేయాలని కోరుతున్నాను

పసుపు విషయంలో ఉన్నటువంటి పెద్ద సమస్య ఏమిటంటే, మార్కెట్ రేటులో విపరీతమైన జూదం జరుగుతున్నది విదేశాలకు ఎగుమతి అవుతున్న పసుపు విషయంలో స్టేట్ ట్రేడింగ్ జరిగినప్పుడు, యీ పన్ను విధిస్తే సవ్యంగా ఉంటుంది తప్ప, యీ లోపలే పన్ను వేయటం ఎంతమాత్రం న్యాయంకాదని మనవి చేస్తున్నాను ప్రభుత్వానికి అదనంగా ఆదాయం రావటంకోసం యీ పన్నులు వేస్తున్నట్లు ఆబ్జక్ట్స్ అండ్ రీజన్స్‌లో తెలియజేశారు. "ఆహార దినుసులుకంటె వ్యాపార దినుసులు పండిస్తే అదనపు ఆదాయం వస్తుందిగనుక, అందులో కొంత భాగాన్ని తీసుకొంటాము" అని ప్రభుత్వం చెబుతున్నది పన్నులు వేయటంలో గ్రేడెడ్ పద్ధతి అమలుపరచినపుడు మాత్రమే, ప్రభుత్వా నికి ఎక్కువ ఆదాయం వస్తుంది అప్పుడే సాంఘికంగా ఎక్కువ న్యాయం కలుగజేయటం జరుగుతుంది "ఆహారపంటలు పండించే రైతులయొక్క ఆదా యములోకంటె, వ్యాపారదినుసులు పండించే రైతులయొక్క ఆదాయములో అసమానతలు విపరీతంగా ఉన్నవి వాటిని తగ్గించే ఉద్దేశంతో, పటుతరంగా గ్రేడెట్ ప్రిన్సిపుల్ అమలుపర్చటంకోసం యీ శాసనం చేయబోతున్నాము" అని స్టేట్‌మెంట్ ఆఫ్ ఆబ్జక్ట్స్ అండ్ రీజన్స్‌లో చేర్చటం చాలా సబబుఅయిన విషయము. ఈ విధంగా ప్రభుత్వంయొక్క విధానాన్ని కొంతవరకు సవరించు కొని పనిచేయాలని కోరుతున్నాను.

*Sri G Ganga Reddi* Sir, I beg to move

"That the Bill be circulated for the purpose of obtaining public opinion"

*Mr Speaker* Amendment moved

*శ్రీ గోపిడి గంగారెడ్డి (ముధోల్) అధ్యక్షా, ప్రజలచేత ఎన్నుకోబడిన మనము, యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించవలసి ఉన్నది. మనపైన ప్రజలకు ఎంత విశ్వాసం ఉందో తెలుసుకొనటానికి యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించాలి కాని యీ ప్రభుత్వం యీ పన్నుల బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించటానికి భయపడుతున్నది ప్రజలమీద యీ ప్రభుత్వానికి నమ్మిక ఉన్నప్పుడు తప్పకుండా యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించాలి ఈ పన్ను పంటపైన వేస్తున్నారా, లేక గుంటపైన వేస్తున్నారా అన్నది నాకు తెలియటంలేదు ఒకవైపున వ్యాపారపంటలమీద పన్ను వేస్తున్నామని చెబుతున్నారు కాని, పంటమీద కాకుండా గుంటమీద పన్ను వేస్తున్నారు సారవంతమైన భూమిని, నిస్సారవంతమైన భూమిని లెక్కగట్టి, సారవంతమైన భూమిమీద ఎక్కువ ధార, సారం తక్కువఉన్న భూమిమీద తక్కువధార ఇదివరకే వేయటం జరిగింది ఈ రకంగా అప్పుడు ధారాబంది చేశారు ఆ చట్టాన్ని అణగద్రొక్కి ఇప్పుడు ఎకరానికి ఒక రూపాయి పన్ను వేస్తున్నారు వేరుసెనగ పంటమీద ఎకరానికి ఒక రూపాయి పన్ను వేస్తున్నారు వేరుసెనగ పండే భూములలో, సారాన్నిబట్టి, ఎకరానికి నాలుగు అణాలు ధారాఉన్నది ఎనిమిది అణాలు ధారా ఉన్నది. రెండురూపాయలు ధారా ఉన్నది. నానిమోజక వర్గం ప్రాంతంలో రు 2-8-0 ధారా ఉన్నది. రు, 2-8-0 ధారా ఉన్న భూమిలో ఎకరానికి 5 పుట్లు వేరుసెనగ పండుతుంది. నాలుగుఅణాల ధారా ఉన్న భూమిలో ఒక పల్లీకాయ కూడ పండదు. 5 పుట్లు పండే భూమికీ పల్లీ కాయకూడ పండని భూమికీ, ఒకటే ధారా వేస్తున్నారు వేరుసెనగకు ఎకరానికి ఒక రూపాయి చెల్లించాలని అన్నారు ఇది ధారాబందికి విరుద్ధంగా ఉంది. ఈనాడు యీ విధంగా పన్ను వేయబడుతోంది.

ఈ surcharge చేయడములో పేద, సాద అనే దయదాక్షిణ్యాలు లేకుండ, ఏదో పది రూపాయలు వరకే మినహాయిస్తూ, ఒక్క ఎకరము కూడ విడవకుండా ప్రభుత్వము పన్ను వేయబోతున్నది. వాణిజ్య పంటలమీద పన్ను వేయడములో ప్రతిఒక్క గుంట మీద ఏ మినహాయింపు లేకుండా పన్ను

వేస్తున్నారు అయితే ఈ వాణిజ్యపు పన్ను వేసేది పంటమీదనా ? లేక గుంట మీదనా ? ఇందులో దేనిమీద వేస్తారు ?

*శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ (అలంపూర్) అధ్యక్షా ! గంగారెడ్డిగారు తన ఉపన్యాసములో గుంటపైన పన్ను వేస్తున్నారు అని అంటున్నారు "గుంట" అంటే, విశాఖపట్టణము జిల్లాలో "పిల్ల" అని అర్థము "యువతికి గుంట" అని అక్కడ అంటారు గుంట అంటే ఏమిటో తెలియజేయమని అంటున్నాను

శ్రీ గోపిరెడ్డి గంగారెడ్డి గుంట అంటే, నలభై గుంటలు అయితే ఒక ఎకరము అవుతుంది

శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ అయితే పంటపైన, గుంటపైన అంటే, దీనికి అర్థము ఏమిటి ?

*శ్రీ గోపిడి గంగారెడ్డి అదే తెలియనివారు తెలుసుకోవలసిన విషయము శబ్దనిఘంటువు చదువుకుంటే, గుంట అంటే ఏమిటో తెలుసుకోగలరు అందుకనే వాణిజ్య పన్ను వేసేది పంటపైనా, లేక గుంటపైనా అని మంత్రిగారిని అడుగుతున్నాను గుంటపైన పన్ను వేస్తే, ప్రభుత్వానికి ధారాబంది కట్టడము ఉంటున్నది కళాకారులు, తెలివిమంతులు ఉండే ఒక Department ఉన్నది. భూసారము లేనటువంటి భూమిని కనిపెట్టి పంట ధర కట్టి దానిమీద వాణిజ్య పన్ను విధించుతున్నప్పుడు, దానికి ధారాబంది కట్టియున్నట్లయితే, అది యీ పన్ను వేయటానికి విరుద్ధము వేరుశనగ పంట వేస్తే, ప్రతి ఒక్క ఎకరానికి ఒక్కొక్క రూపాయి చొప్పున పన్ను కట్టవలసి వస్తుంది ఈ విధానము సరియైనది కాదు ఇప్పుడు యీ బిల్లును ప్యాసుచేస్తే, ఇది అమలులోనికి వస్తుంది ఈ బిల్లును పరిశీలించి చూస్తే, పంట వచ్చినా, రాకపోయినా, వాణిజ్య పంట ఏది వేసినను, దానికి పన్ను కట్టాలి అని ఉన్నది. ఇంతే కాకుండా పంటకు ధర ఉన్నా లేకపోయినా, ప్రభుత్వానికి పన్నుకట్టవలసిందే ఈ విధముగ బిల్లులో ఉన్నది. ఈ బిల్లును అమలులోనికి తెచ్చేటప్పటికి, వాణిజ్య పంట అంతా యింటికి యిదివరకే వచ్చివేసింది ఇప్పుడు ఈ బిల్లు అమలులోకి వచ్చినప్పుడు ప్రభుత్వోద్యోగులు వెళ్ళి పంట ఎంతవచ్చినదో ఎట్లా తేల్చగలరు ? రైతులు పన్ను ఎగగొట్టటానికి పంట నష్టమైపోయింది, ఏమీ రాలేదు అని చెప్పే అవకాశము ఉన్నది. దీనియొక్క నిజా నిజములు కనిపెట్టటము కష్టము. ఉద్యోగస్థులు అక్రమంగా పన్ను వేస్తే, అది రైతులను అన్యాయముచేసి అక్రమముగ వసూలుచేయడమే

అవుతుంది పోనీ పొలము వెళ్ళి పరిశీలించి పన్ను విధిస్తారా, అంటే, అక్కడ పంట కన్పించదు మట్టిగడ్డలే కనబడతాయి అందువల్ల క్రమమైన పన్ను వేయటానికి అవకాశము లేనటువంటి బిల్లు ఇది ఇప్పుడు ఈ బిల్లును ప్యాసుచేస్తే, దీనివల్ల పన్ను వేయటానికి యీ సంవత్సరానికి ఉపయోగించదు గనుక, వచ్చే సంవత్సరము దీనిని ఉపయోగపరచవచ్చు

ఇక పత్తి విషయము తీసుకుంటే, మా ప్రాంతములో పత్తి పంట వేస్తే, సరుగుడు అనేది ఉంటుంది సరుగుడు అంటే వంటచెరుకని అర్థము ఈ సరుగుడును రైతులు మూడు నాలుగు సంవత్సరములదాకా ఉపయోగిస్తారు ఈ సరుగుడు మీద పన్ను వేయటానికి ప్రభుత్వము తలపెట్టలేదు ఈ బిల్లులో దాని సంగతే లేదు ఈ సరుగుడును లెక్కకట్టి పన్ను వేసేటట్లయితే, దాని మీద ఒక్క రూపాయో, యింకా ఎంతో లెక్కకట్టి వసూలుచేయవచ్చు అయితే యీ పత్తి మీద, సరుగుడు మీద పన్ను విధించాలి అంటే, ఇది పొలములోనుంచి పంట రాకముందే లెక్కకట్టాలి గాని, పంట ఇంటికి వచ్చిన తరువాత లెక్క కట్టటానికి వీలుండదు ప్రస్తుతము ఈ సంవత్సరానికి యీ బిల్లు పత్తి విషయములో కూడ ఉపయోగించదు ఇది వచ్చే సంవత్సరానికే ఉపయోగిస్తుంది. మరొక విషయము వాణిజ్యపంటలు మెట్టభూములలో ఏవి అయితే ఎక్కువగ వేస్తారో, వాటిమీదనే పన్ను విధించాలని ఉన్నది పత్తి వేసేటప్పుడు కేవలము ఒక్కొక్క నెంబరుగల భూమిలో ఏ పది ఎకరములో ఉంటే, ఆ పది ఎకరముల మొత్తంలో పత్తి ఒక్కటే వెయ్యరు. ఒక ఎకరము భూమిలో మిర్చికూడ వేస్తారు. అయితే పన్ను వేసేటప్పుడు 1 ఎకరములో వేసిన మిర్చిమీద పన్ను వేస్తారా? లేక పత్తి వేసినంతవరకు మిర్చ వేసిన ఎకరమును మినహాయించి, తొమ్మిదిఎకరాలమీద వేస్తారా? నిజానికి ఏ పంట ఎక్కువగ వేస్తే, ఆ పంటమీద లెక్క కట్టాలంటే, అప్పుడు గ్రామ ఉద్యోగస్థులు తమ యిష్టమువచ్చినట్లుగ లెక్కలు వ్రాస్తారు ఒక్కొక్కప్పుడు అవి సరిగా ఉండవు రైతులకు అన్యాయము జరిగే లెక్కలుగాకూడ ఉంటవి. గ్రామోద్యోగస్థులకు లంచముయిస్తే, రైతులు తక్కువగ పన్ను కట్టటానికి వీలుగ తయారుచేస్తారు. దీనివల్ల ప్రభుత్వానికి రావలసిన ఆదాయము రాదు. కనుక ఇది సరియైన పద్ధతి కాదు ఏ ఏ రైతు ఎంతెంత భూమిలో ఏ ఏ పంట వేశాడో తెలియటానికి ఉద్యోగస్థుల మీద ఆధారపడవలసిఉన్నది. ఇప్పుడు పది ఎకరములు గల ఒక నెంబరుగల భూమి ఉంటే, అందులో తొమ్మిది ఎకరములలో పత్తి, ఒక ఎకరములో మిర్చి వేసి ఉంటే, పంటకోసి యింటికి తీసుకునిపోయిన తరువాత దీని యొక్క నిజస్థితి ఎట్లా తెలియగలదు? తొమ్మిది ఎకరాలలో మిర్చి, ఒక ఎకరములో పత్తివేశాడని గ్రామో

ద్యోగులు వ్రాస్తే, దీనిలో నిజస్థితి కనుక్కునేది ఎవరు? వారు ఎంత వ్రాస్తే, అంతమీద పన్ను వేసి వసూలుచేయడము జరుగుతోంది రైతులను అన్యాయము చేయాలంటే చేయగల అవకాశములు యీ బిల్లులో ఉన్నవి కనుక ఈ సంవత్సరమునకు ఏ భూమిలో ఏ ఏ పంట వేశారో, అది యిప్పటికే యిళ్ళకు వెళ్ళి పోయింది గనుక, ఇది లెక్కతేలే అవకాశములేదు గనుక, ఈ సంవత్సరానికి యీ బిల్లు ఉపయోగించదు ప్రభుత్వమువారు యీ బిల్లును ప్యాసుచేయించి, అమలుకు తెస్తే, దీనివల్ల యీ సంవత్సరానికి పన్ను విధించేటప్పుడు భాగ్యవంతులు, ధనవంతులు తమ యొక్క influence ఉపయోగించుకొని తప్పించుకోటానికి చూస్తారు. పేద రైతుల మీద అక్రమపు లెక్కలు వ్రాసి పన్ను వేస్తే, అన్యాయమే జరుగుతుంది. ఇంతకంటే యీ సంవత్సరానికి జరగబోయేది ఏమీలేదు ఈ బిల్లుద్వారా పన్నులు వేసే విధానము ఎట్లా ఉన్నదంటే, కసాయి వాడు తన యిష్టము వచ్చిన జంతువును కత్తి పదునులేని వైపున వెనుకకుత్రిప్పి కొట్టుతాడు అది తప్పించుకొనిపోతోంది ఇష్టములేని జంతువు పదునువైపున పెట్టి కొట్టితే అది తప్పించుకోలేక మెడ తెగిపోతుంది అట్లాఉంది యీ పన్నులు విధించే విధానము కాబట్టి యీ సంవత్సరానికి యీ బిల్లు ఉపయోగించదు దీనిని రాబోయే సంవత్సరానికి ఉపయోగించవచ్చు గనుక, ఈలోగా దీనిని ప్రజాభిప్రాయమునకు పంపితే మంచిదని దీనిని మంత్రిగారు పునరాలోచిస్తారని ఆశిస్తున్నాను నిన్నటిదినమున మంత్రిగారు మా ప్రభుత్వము అహింస, సత్యము అవలంబిస్తున్నదని అన్నారు. రామరాజ్యమును స్థాపించుతున్నామని అన్నారు నా అభిప్రాయములో యీ పన్నుల బిల్లులను చూస్తే, ఇది రామరాజ్యము కాదు, రాములవారు యిచ్చినరాజ్యము అని చెప్పవలసియున్నది

మిస్టర్ స్పీకర్ ఇక general సమస్యల లోకి, పార్టీ సిద్ధాంతాలలోకి పోక, బిల్లును గురించే మాట్లాడండి.

*శ్రీ గోపిడి గంగారెడ్డి : ఇప్పుడు నేను మాట్లాడేది పార్టీ సిద్ధాంతాలను గురించి కాదండి మొన్నటి రోజున చర్చల సందర్భములో లక్ష్మీకాంతమ్మగారు గుమ్మడికాయ కథ చెప్పారు. అదే రామాయణములో మేము, వింటున్నాము రాములవారు 14 సంవత్సరములు అరణ్యవాసమునకు పోవలసి వచ్చినప్పుడు, ఆయన అయోధ్యానగరమువిడిచి అడవికివెళ్లేటప్పుడు, అయోధ్యానగరములోని పురజనులు అందరు ఆయనను సాగనంపటానికి వెళ్ళారు. ఆయన సరయు నదిదగ్గరకు పోయినతోడనే, వారందరితో "నరనారీ చెలోజావ్" అన్నారట కాని రాములవారు వెళ్ళిపోయినను, వెళ్ళిన పురజనులందరు, ఆయన అరణ్యా

వాసము 14 సంవత్సరములు చేసి తిరిగి వచ్చేటప్పటికి అక్కడనే ఉన్నారట "ఏమిటి? మీరు అందరు ఇక్కడనే ఉన్నారే! ఎందువల్ల!" అని అడిగితే, తమ యొక ఆజ్ఞ మాకు దొరకలేదు అందువల్ల మేము మీ కోసము తపస్సు చేసు కుంటూ ఇక్కడనే మీ రాకకు ఎదురుచూస్తూ ఉన్నాము రాములవారు లేనిది మాకు అది రాజ్యము కాదు" అన్నారట "మీకు అప్పుడే రామరాజ్యము ఇచ్చే వాడినేకాని, దానికి మొదట పితృవాక్యమును నేను పాటించవలసి ఉన్నది ముందు కలియుగము ప్రారంభము కాబోతున్నది, అప్పుడు మీరు 14 సంవత్స రాలు రామరాజ్యము ఏలండి" అన్నారట అట్లాగే ఇప్పుడు ఈ రాజ్యము ఆ రాజ్యముతీరుగానే కనబడుతున్నది కాబట్టి నేను ఈ బిల్లు విషయములో చెప్పదలచినది ఏమిటంటే, ఇది ఈ సంవత్సరమునకు ప్రజలకు ఉపయోగించదు, ప్రజలమీద అన్యాయపు లెక్కలు వ్రాయటానికి వీలు ఉంటుంది కాబట్టి దీనిని వచ్చే సంవత్సరమున ఉపయోగిస్తే సమంజసము ఈలోగా దీనిని ప్రజాభిప్రాయ మునకు తప్పకుండ పంపవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను

*శ్రీ టి రామచంద్రారెడ్డి (పుట్లూరు) అధ్యక్ష మహాశయా, రాష్ట్ర ములో అభివృద్ధి ప్రణాళికలను జయప్రదముగ నెరవేర్చాలనే సాకుతో పన్నులు ప్రతి సంవత్సరముకూడ పెంచుకుంటూ పోవడము ప్రభుత్వా నికిపరిపాటి ఐపోయింది సర్చార్జీ అని, వాణిజ్యం పన్ను అని, wet assess-ment అని ప్రభుత్వము తెచ్చిన బిల్లులను ఇక్కడ సభలో నాలుగు రోజు లుగ చర్చిస్తున్నాము రైతులు వాణిజ్య పంటలు వేసి, ఎక్కువగ లాభాలు సంపాదించుకుంటున్నారని, వాణిజ్య పంటలమీద పన్ను ఎక్కువ చేయటానికి బిల్లు తెచ్చారు రైతాంగము, ముఖ్యంగా పత్తి, వేరుశనగ పంటలమీద ఎక్కువగ లాభాలు గణించుచున్నారని ప్రభుత్వము ఉద్దేశిస్తూంటే, దీని యొక్క నిజానిజములు ఒక్కసారి ప్రభుత్వము దర్యాప్తు చేస్తే బాగా ఉంటుంది పండించ వలెనని వేసినపంట ఒక్కొక్క సంవత్సరము వర్షాలు లేక పాడయి పోవడము కద్దు ఆ సంవత్సరము విడిచిపెట్టి, అథవా, ఏమాత్రమైనా, మరుసటి సంవత్స రము పండితే, దానికి ధరలు ఉండవు ఒకవేళ అదృష్ట వశాత్తు ఏ 3, 4 సంవ త్సరాలకో ఒకసారి పంటపండితే అప్పుడు ధరవుంటే, అప్పుడు రైతు అదృష్ట మనే అనవచ్చును. అయితే ఎప్పుడో ఒక సంవత్సరము పంట తృప్తికరముగా ఉంటే, అదివరకు పంటలు పోయిన సంవత్సరములోని నష్టము, ధరలు లేని సంవత్సరములోని నష్టము, ఇదంతా పూడ్చుకోవలసిన అవసరము ఉంటుందా లేదా అనేది నా ప్రశ్న. ఇప్పటికే రైతులు అప్పులు కోట్లకొలది చేసి వాటినితీర్చలేని పరిస్థితిలో ఉన్నారని ప్రభుత్వము గుర్తించాలి. ఈ పన్నులబిల్లులు చూస్తే, పేద

రైతుకును, బాగా పంటలు పండించుకునే భూస్వామికిని పన్ను విధింపులో ఏమాత్రము వ్యత్యాసము లేకుండా ఉంటున్నది. అందరికీ ఒకే రకమైన పంట రావడము లేదు అది లేనప్పుడు పన్నుమటుకు ఒకేరకముగ ఎట్లా వేయదలచు చున్నారు, అర్థము కాలేదు రాష్ట్రములో బీద, బక్క, పేద, సాద అనేవారు రైతులలో గూడ ఉన్నారని ప్రభుత్వానికి తెలియదా ? అందరికీ ఒకే రేటులో పన్ను వేయడము న్యాయముకాదు అందులో ముఖ్యంగా ప్రత్తి, వేరుశనగ వేసేరైతులు మెట్టభూములలో మాత్రమే వేస్తారు మెట్టపైర్లు వర్షముమీద ఆధార పడి ఉంటాయి పంటలు పండకపోతే, ప్రభుత్వము రైతులకు ఏమైన సహాయము చేస్తున్నదా ? ప్రభుత్వము ఏర్పాటుచేసిన నీటిపారుదలగల ప్రదేశాలలో వేసిన మాదిరిగా మెట్టపైర్లమీద కూడ అదేవిధముగ వేయడము న్యాయమా ? ఈ పన్నుల విధింపులో పేదరైతులకు జరిగే అన్యాయాలను కొంతవరకు సావధాన ముగ ఆలోచించవలసిందిగ కోరుతున్నాను అందులో ఇప్పటికే వేరుశనగ పంటమీద indirect tax రైతులు అనుభవిస్తున్నారు అదిగాక మరల ఈ బిల్లు ద్వారా direct-tax ప్రభుత్వము వేయదలచుకున్నది మెట్టభూములలో ప్రత్తి, కొర్రవేసే రైతులకు పన్ను మినహాయింపుకు సెలెక్టు కమిటీవారు ఒప్పుకున్నారు వేరుశనగ పైరుతోకలిసి జొన్న, సజ్జ, కంది యిలాంటి పైర్లు వేస్తారని ప్రభు త్వము మరచిపోగూడదు ఈ పైర్లకుగూడ పన్ను మినహాయింపు యివ్వమని మంత్రిగారిని కోరుతున్నాను నిజస్థితి పరిశీలించాలని మంత్రిగారు అనుకునే టట్లయితే, రేపు వారు రైలులో ప్రయాణము చేసేటప్పుడు రైలుపట్టాల ప్రక్కనే వేరుశనగ, సజ్జ, జొన్న, ప్రత్తి వగైరా పైర్లు ఎంతబాగా ఉన్నవో, వాటిమీద పన్ను వేయతగునా, లేదా అనేది ఒక పర్యాయము గమనించ వలసిందిగా కోరుతున్నాను ప్రభుత్వము పన్ను వేయటానికి తగినంత పైరులేదని వారికే అర్థమవుతుంది కాబట్టి కొర్రకు, ప్రత్తికి మినహాయింపు యిచ్చినట్లుగ తక్కిన పైర్లకుగూడ పన్ను మినహాయింపు యివ్వాలని అంటున్నాను.

వేరుశనగ మీద రైతులు అధిక లాభాలు పొందుతున్నారని వారి అభి ప్రాయం కాని వేరుశనగకు ఎంత పెట్టుబడి పెట్టాలో తెలుసునా ? వేరుశనగ వేయగానే సరిపోదు దానికి అనేక వ్యాధులు వస్తాయి వేరు పురుగు పడు తుంది. 10 ఎకరాలలో వేస్తే ఈ వ్యాధివలన అయిదెకరాల పంట పోతుంది, కాని దానికేమయినా మినహాయింపులు యిస్తున్నారా ? ఆ పది ఎకరాలమీద యీనాడు శిస్తు విధించడానికి అవకాశంవుంది కనుక యివన్నీ సావకాశంగా ఆలోచించాలని మీద్వారా వారి దృష్టికి తెస్తున్నాను. ఉదాహరణకు రాయల సీమ ప్రాంతంలో 5 ఎకరాల పొలమున్న బీదరైతు రెండెకరాల్లలో మాత్రమే

వేరుశెనగ వేసి, మిగతా ఎకరాలలో ధాన్యం పైరు పెడుతూ వుంటాడు. కాని ఈబిల్లులో మొత్తం ఎకరాలమీద పన్ను విధింపు చేయబడ్డది ఈవిషయంను యింతకు పూర్వం కూడా విమర్శ చేసి వున్నాము దీనిని పునర్విమర్శ చేయాలని కోరుతున్నాను 'Entire land' మీద పన్ను వేయాలని వుంది 'Entire land' అంటే ఏమిటో అర్థం కావడంలేదు బాగా explain చేయాలి "Commercial crops యొక్క ధరలు పడిపోతే అప్పుడు ఆలోచిస్తాం" అని చెప్పారు ధర అంటే ఏ ధర ? మూడు రూపాయలా, నాలుగు రూపాయలా, అయిదు రూపాయలా, ఎంతో చెప్పాలని కోరుతున్నాను ఇందులో "ఒకవేళ జాడ్యాలువచ్చి, వర్షాభావం వల్లపంటలుపోతే, రైతు application పెట్టుకొంటేమాత్రం మేము ఆలోచిస్తాం" అని చెబుతున్నారు కొన్ని గ్రామాలలో వరిపైరుకు వ్యాధి వచ్చి సంపూర్ణంగా పంటపోయిందని ఒక సంవత్సరం క్రితం ప్రభుత్వానికి ఒక అర్జీ యిచ్చాను ఈనాటికీ కూడా ఆ petition ప్రభుత్వందగ్గరే వుంది కాని, దానిపై ఏ చర్యా తీసుకోలేదు కనుక కుగ్రామంలోవున్న రైతు దరఖాస్తు పెట్టుకుంటే ఎంత మాత్రం న్యాయంచేస్తారో ఆలోచన చేయాలని ప్రభుత్వానికి మీద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను

***Sri S Ranganadha Mudaliar (Ramakrishnarajupeta)** Mr Speaker, Sir, is the Honourable Member who is speaking now, a dissident of the Congress Party

*Mr Speaker* I have nothing to do, nor has the hon Member get any thing to do with it

*శ్రీ టి. రామచంద్రారెడ్డి ఈ విషయాలను కొంతవరకు సాకల్యంగా పునర్విచారణ చేయాలని మీ ద్వారా ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను

*శ్రీ టి లక్ష్మీనారాయణరెడ్డి (అనపర్తి). అధ్యక్షా, స్వపక్షీయుడైన శ్రీ రామచంద్రారెడ్డిగారి సుదీర్ఘమైన ఉపన్యాసాన్ని విన్నతరువాతనూ, గత 20 రోజులనుంచి ప్రతిపక్షీయుల వారు చేస్తున్న ఉపన్యాసములు విన్నతరువాతనూ నేను యీనాడు వేయబోయే పన్నులన్నీ సవ్యమైనవి, న్యాయసమ్మతమైనవి అవసరమైనవి అని భావిస్తున్నాను. ఎందుచేతనంటే—శ్రీ వెంకటరావుగారు చెప్పినట్లు యీనాడు peace emergency వుందని మనకందరకూ తెలుసును మనం పేదరికం మీద, నిరక్షరాస్యత మీద, అనారోగ్యం మీద యుద్ధం ప్రకటించాము దానికోసం కొన్ని ప్రణాళికలను తయారుచేశాము. వాటిని

సాఫల్యం చేసుకోవాలంటే చిన్నా పెద్దా, అందరూ కొంత త్యాగంచేయాలి అటువంటి సందర్భాలలో, పన్నులంటే ఎవరికీ యిష్టం కాదు కష్టాలుంటాయి అయినప్పటికీ భరించి, దృఢసంకల్పంతో ముందుకు పోవడానికి సంకల్పించు కున్నప్పుడే వెనుకబడివున్న భారతదేశమును చాలా అభివృద్ధిలోవున్న దేశ ములను అందుకునేటట్లు కొంత కాలంలో చేయగలుగుతాము లేనట్లయితే మనం వెనుకబడే వుంటాము. ఆ సంగతి ఆలోచించినట్టయితే, యీనాడు వేసే చిన్న పన్నులకోసం యింత తాపత్రయ పడతారని అనుకోను ఈ ఉపన్యాసాలన్నీ విన్నతరువాత నా నియోజకవర్గంలో ఎట్లావుందని శాసనసభ జరుగుతున్నప్పుడే ఒకసారి పోయివచ్చాను మన ప్రతిపక్షమువారు చేసిన ఉపన్యాసముల ఫలితం కొంత అక్కడ వుంది వారంతాకూడా నన్ను గట్టిగా, "ఏమిది? బ్రిటిషు ప్రభుత్వంలో లేదు జమీందారుల హయాంలో లేదు ఇన్నిపన్నులు ఎందుకు వేస్తున్నారు" అని అడిగారు

"ఇదివరకు మనం police state లో ఉండేవారము police state లో చేసేపని law and order సరిచూడడము మాత్రమే కాని, యిప్పుడు మనం welfare state లోకి పోతున్నాం ప్రతి చిన్నకష్టంకూడా తీర్చే బాధ్యత ప్రభుత్వంపైన పడింది కనుక ఎక్కువ ఖర్చుపెట్టవలసివుంది, దానికోసం పన్నులు అవసరం" అని అప్పుడు వారితో చెప్పాను ఇంకా "మీ రందరు పురాణాలు, మను ధర్మశాస్త్రాలు చదువుతూ వుంటారు, వింటూ వుంటారు, 'మీ ఆదాయములో నాలుగోవంతు గాని ఆరోవంతుగాని ప్రభుత్వానికి, లేక రాజుకు యివ్వాలి' అని శాస్త్రాలలో వుందికదా! ఈనాడు మీపై విధిస్తున్న పన్ను మీ ఆదాయంలో నాలుగోవంతు, ఆరోవంతు వుందా?" అని అడిగాను. అది అంతమాత్రం కూడా లేదని వారంగీకరించారు. దానితో సంతోషించి వెళ్ళిపోయారు అందుచేత రైతులు యీ పన్నులు భరించలేరని చెప్పడంలో సత్యం లేదనుకుంటున్నాను. ఈనాడు మనం చేస్తున్న ప్రతిపనీ సామాన్య పౌరుని-దృష్టిలో పెట్టుకుని వారిమంచికే చేస్తున్నాం నాగార్జునసాగర్ కట్టినా, మరొక రోడ్డు వేసినా— ఏ పని చేసినా సామాన్యపౌరునికి లాభం కలుగాలనే దృష్టితోనే చేస్తున్నాము. ఈ democracy సామాన్యప్రజల సహాయసంపత్తులు తీసుకోకపోతే progress జరుగదని మనం తెలుసుకొంటున్నాం Socialistic pattern లో భాగ్యవంతులను తగ్గించే ప్రయత్నం చేస్తున్నప్పుడు tax structure సాధారణ ప్రజలమీద ఆధారపడకపోతే లభించేది యేమీవుండదు కాబట్టి వేటి కోసమయితే లాభాన్ని చేయడానికి సంకల్పించుకుని యీపనులన్నీ చేస్తున్నామో వాటికొరకు సాధారణ ప్రజల సహాయసంపదలను అన్నివిధాలా తీసుకోడంలో

న్యాయంవుందని భావిస్తున్నాను తరువాత ప్రతిపక్షమువారు "అస్తమానం అన్నిపన్నులూ పేదప్రజలమీదే పడుతున్నాయి, భాగ్యవంతులను వదిలేశారు" అనే remarks చేస్తున్నారు అది న్యాయమైనది కాదు మనం tax వేసినప్పుడు ఎదురుగుండా వున్న ఈ ఒక బిల్లునే కాకుండా ఇండియా ప్రభుత్వం, మన రాష్ట్ర ప్రభుత్వం అందరూ వేసే overall tax structure చూస్తే అది నిజము కాదని తేలుతుంది Wealth tax వుంది, Income tax, Estate taxలు వున్నవి మొత్తం వీటినన్నింటినీ చూచినట్లయితే ఎవరిని వదిలిపెట్టలేదని ఎవరిశక్తినిబట్టి వారిపై పన్ను వేస్తూనే వున్నామని, అన్నివిధాలా ప్రభుత్వానికి ఆదాయం వచ్చే మార్గాలు అన్వేషిస్తున్నాం కాబట్టి ఆ ఆరోపణకూడా నిజమైనది కాదని రుజువవుతుంది ఇంకో విషయం మనం దీర్ఘంగా ఆలోచించాలి దేశంలో పెద్ద పెద్ద పనులకోసం కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టేటప్పుడు ఆ ధనం అంతా ప్రజలలో వుండిపోయినప్పుడు taxation మూలంగా గాని, savings మూలంగా గాని ఆ డబ్బును ప్రభుత్వం తీసుకోకపోయినట్లయితే inflation అనే రాక్షసి బ్రహ్మాండముగా పెరుగుతుంది దానిని మనం అరికట్టకపోతే మనం చేసిన మంచిపని నిరుపయోగమవుతుంది మనం విషమ పరిస్థితులలో పడిపోతాం 'Too much money will be seizing too few goods' అటువంటి పరిస్థితిని మనం అరికట్టకపోతే అది సాధ్యంకానిది అయిపోతుంది కాబట్టి పన్నులద్వారా గాని, savings ద్వారా గాని అన్నివిధాల ఆ బ్రహ్మరాక్షసిని ఎప్పటికప్పుడు అణచిపెడుతూ వుండాలి కాబట్టి ప్రభుత్వం యీనాడు వేస్తున్న పన్నులన్నిటినీ బలపరుస్తూ విరమిస్తున్నాను.

*శ్రీ పి రామాచార్లు (ధర్మవరం-జనరల్) అధ్యక్షా, తమరు నాకీ అవకాశం ఇచ్చినందుకు అభినందిస్తూ ఈ సందర్భంలో కొన్ని విషయాలు చెప్ప దలచుకొన్నాను మన ప్రభుత్వం వేసే పన్నులలో కమ్మర్షియల్ టాక్సు అని వసూలు చేయటం న్యాయమనే నేను అభిప్రాయ పడుతున్నాను రెవిన్యూ డిపార్టుమెంటు వారితో మాట్లాడిన సందర్భంలో ఒకసారి నేను వారికి "ఆహారధాన్యాలు పండించే భూములపై పన్ను తగ్గించి, ఈ కమ్మర్షియల్ క్రాప్స్‌పై ఎక్కువ పన్ను వేస్తే బాగుంటుంది" అని సలహా ఇచ్చాను. మొత్తం ఆహారధాన్యాలు పండించే భూములపై అసలు పన్ను లేకుండా, శిస్తు లేకుండా చేసి, కమ్మర్షియల్ క్రాప్స్‌పైననే వేస్తే బాగుంటుందని కూడా అభిప్రాయ పడేవాడిని ఆ విధమైన సూచన నేను చేస్తే శ్రీ వెంకట్రావుగారు అదీకావాలి, ఇదీకావాలి అనే అభిప్రాయానికి వచ్చారు. వారి ధోరణి నాకొక సామెతను గుర్తుకు తెస్తున్నది. అత్తగారు అల్లుడిని "నాయనా! ముందు వలహారం

చేస్తావా ? చద్దియన్నం తింటావా ? లేక విందువరకు వుంటావా ?" అని అడిగిందిట అప్పుడు అల్లుడు "ఇప్పుడు పలహారం చేసి, తరువాత చద్దియన్నం తిని, విందువరకు వుంటాను అత్తయ్యా !" అని సమాధానం ఇచ్చాడుట ఏ కొత్తసూచన చేసినా అవి వేసి, తక్కువ వున్నవాటినికూడా హెచ్చించటానికి మంత్రిగారు ప్రయత్నిస్తున్నారు కమ్మర్షియల్ క్రాప్స్‌పై పన్ను వేయాలనే అభిప్రాయం ఇదివరకు ఎక్కడా నేను వెలిబుచ్చలేదు కాని యిప్పుడు వేయటం యుక్తముగా వుందని మనవి చేస్తున్నాను కాని ఒకటి చేయబోతే మరొక ఫలితం ఈ బిల్లువల్ల వస్తుందేమోననే భయం నాకు కల్గుతోంది 20, 30 ఎకరాలుగా ఒక సర్వేనెంబరు వుంటుంది దానిని field అంటారు East Godavary లో ఈ కమ్మర్షియల్ క్రాప్స్ అంతగా లేవు అనుకోండి రాయలసీమలో పత్తి, పొగాకు, మిర్చి వేస్తూ వుంటారు అక్కడ రైతుకు వున్న భూమిలో కొంత భాగములో తన సంసారానికి కావలసిన పదార్థాలను, కొంత మిర్చి, కొంత పొగాకు, కొంత ఉల్లిగడ్డలూ పండించుకొంటాడు. ఈ బిల్లులో "entire field" అని వుంది 20 ఎకరాల భూమిలో ఆహారధాన్యాలను పండించుకొంటూ పదిసెంట్లలో మిర్చి, పదిసెంట్లలో పొగాకు, పదిసెంట్లలో ఉల్లిగడ్డ పండిస్తే ఈ "entire field" అని ఉండటంవల్ల 20 ఎకరాలకు వసూలు చేయాలనే అర్థం కన్పిస్తున్నది రు 0-2-0, రు 0-4-0 శిస్తు వుండే భూములు ఎక్కువ, ఇటువంటి భూములకు రు 1-0-0 అని పెట్టారు రు 0-2-0 కట్టే వ్యక్తికి 20 ఎకరాలువుంటే, ఇదివరకు రు 2-8-0 కడితే, ఈ బిల్లువల్ల ఏ కొద్ది స్థలంలో పొగాకు, ఉల్లి పండించుకొంటే 10-0-0 కట్టవలసి వస్తుంది ఇది అక్రమంగా కన్పిస్తోందని మనవిచేస్తున్నాను. జొన్నలో పత్తి కలిపివేస్తే పత్తిధర వేస్తామని చెప్పటం న్యాయంగానేవుంది కాని entire field అనకుండా వారు ఎంత స్థలంలో పండిస్తే అంతస్థలం వరకే వసూలుచేయాలి అలా చేయక entire field అంటే ఇకమీదట రైతు తన కుటుంబమునకు అవసరమైన పదార్థాలను పండించుకోడు ఎక్కువ పన్ను కట్టవలసి వస్తుందని పండించటం మానుకొని ఎక్కువ ధరవున్న మార్కెట్టులో కొనుక్కుంటాడు అది అన్యాయంగా వుంది కనుక కమ్మర్షియల్ క్రాప్స్‌పై వేయాలనే సూత్రాన్ని ఆమోదిస్తూ, entire field అనికాక, ఎంతభూమిలో పండిస్తే ఆ భూమి మీదనే వేయాలని మనవి చేస్తున్నాను.

*రెవెన్యూ శాఖామాత్యులు (శ్రీ కె. వెంకటరావు): అధ్యక్షా! ఈ సమస్యను ముందే clear చేస్తే House కు కొంత time కలిసివస్తుంది. Entire field అనే మాటకు సభ్యులు వేరేఅర్థం తీసికొంటున్నారు 10 ఎకరాలు ఉన్న రైతు

9 ఎకరాలలో ఏదో పంట వేసుకొని ఒక ఎకరములో కమ్మర్షియల్ క్రాప్స్ వేస్తే మొత్తం 10 ఎకరాలకు ఈపన్ను collect చేస్తారనే భావం సరైనదికాదు వేసిన ఒక్కఎకరానికే వసూలు చేయబడుతుంది మిగిలిన ఎకరాలకు దీనికి ఏమి సంబంధంలేదని శ్రీ రామాచారిగారికి శ్రీ టి. యన్ రామచంద్రారెడ్డిగారికి ఇతరులకు మనవిచేస్తున్నాను

శ్రీ పి సత్యనారాయణ గట్టుచుట్టు వేసినాకూడా వసూలు చేయరా ?

శ్రీ కె వెంకటరావు 100 ఎకరాలు వున్నప్పటికీకూడా గట్టుచుట్టూ వేసేదానికిలేదని ఇదివరకే మనవిచేశాను చుట్టు కందిమొక్కలు వగైరాలు వేసుకొన్నా, వాటికి ఇది వర్తించదు

శ్రీ పి రామాచార్లు రెవెన్యూ మంత్రిగారు అలా చెప్పినందుకు చాలా సంతోషము చట్టములో ఆ సంగతి clear చేస్తే బాగుంటుందని భావిస్తున్నాను

"If such crop above was raised on the entire land, the special assessment shall be levied at the higher or highest of the rates applicable to any one of the crops so specified and raised on the land, as if such crop alone was raised on the entire land" అని బిల్లులో వుంది వేసుకొన్న ఎకరాలకి మాత్రమే apply అవుతుందనే భావం ఇందులోలేదు అందువల్ల దానిని స్పష్టపరచాలని కోరుతున్నాను

శ్రీ యం నాగిరెడ్డి (మాచర్ల) . అధ్యక్షా ! ఈ సెషన్‌లో ఇప్పటికి రెండు పన్నులను రైతులపై విధించటం మనం చూచాము ఈ పన్నులకు మేము వ్యతిరేకంకాదని ప్రజాప్రభుత్వమునకు తెల్పుతున్నాను కాని ఆ వేసేపన్నులు మోయగల్గినవారిపైన వేయాలని మేము పదేపదే చెబుతున్నాము ఇప్పటికి pass చేసిన రెండు బిల్లుల్లోకూడా అందరిపైనా ఒక flat rateగా పన్ను పడటం చూచాము సర్చార్జిలో గ్రెడేషన్ అని నామమాత్రముగా వుందికాని వాస్తవంలో, ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సును రద్దుచేయటంవల్ల అందరిపైనా ఇది పడేటట్లుగానే ఆ బిల్లునుకూడా pass చేశాము మరల వ్యాపార పంటలపై పన్ను వేసే ఈ బిల్లును మాత్రం మేము వ్యతిరేకించక తప్పదని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఏ పరిస్థితుల్లో ఏపద్ధతులలో ఈ బిల్లును తేవాలో ఆలోచించి ఈ బిల్లును ప్రభుత్వం తీసుకురాలేదు Averageగా వ్యాపారపంటలు ఎట్లా పండుతాయి ? ఎటువంటి చేట్లు వుంటాయి ? దీనికి పన్ను వేసే పరిస్థితులు వున్నాయా ? లేవా ?

అనే విషయం ప్రభుత్వం ఆలోచించలేదు రాష్ట్రప్రభుత్వము, కేంద్రప్రభుత్వము కూడా ఇదివరకే ఈ వ్యాపారపంటలపై పన్నులు వేసినవి వర్జీనియ, నాటుపొగాకులపై Excise duty గా కేంద్రప్రభుత్వము, సేల్స్‌టాక్సుగా రాష్ట్రప్రభుత్వం వసూలుచేస్తున్నది ఇదివరకువేసిన పన్నులను దృష్టిలో వుంచుకొని ఈ పన్నులను ఎలా వేయాలనేది ఆలోచించవలసిందని మంత్రిగారిని నేను కోరుతున్నాను ప్రత్తిగాని వేరుశనగగాని, 4, 5 ఎకరాలలో చిన్నరైతులు, పేదరైతులే వేస్తూవుంటారని మెట్టప్రాంతమునుండి వచ్చిన శ్రీ రామచంద్రారెడ్డిగారే చెప్పారు

అది వేసినప్పుడు వారికి యీ బిల్లువల్ల ప్రభుత్వం ఏమైనా concession యిచ్చినదా? దీనినిగురించి ఆలోచించినదా? కనీసం వారిమీద ఏవిధంగా వేయాలి అనేది చూచినదా అంటే అదికూడా చూడలేదు ఈ మూడు పరిస్థితులనూ గమనంలోకి తీసుకొనకుండా "మేము ఎకరానికి ఇంతపన్ను వేస్తున్నాం" అనేరకంగా బిల్లును తీసుకువచ్చింది ప్రభుత్వం మేము తప్పనిసరిగా దీనిని వ్యతిరేకించవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయని ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను ఇప్పుడు వేరుశనగ, ప్రత్తి మొదలైన వ్యాపారపంటలను రైతులు ఎందుకు వేస్తారు అనేది చూడాలి ఒక్కొకసారి ఎక్కువగా వర్షాలుంటాయి, సకాలంలో సక్రమంగా వర్షాలుండవు, ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్కపైరు పండుతుంది ఒక్కొక్క సంవత్సరం పండదు మెట్టప్రాంతాలలోని రైతులందరూ ఎన్నో రకాల పైరులువేస్తే దాంట్లో రెండు, మూడురకాల పైరులయినా పండుతాయనే దృష్టితో యీ పైరులన్నీ వేస్తారు. రాయలసీమలోనూ, గుంటూరు జిల్లాలోని పలనాడు, వినుకొండ మొదలగు మెట్టప్రాంతాలలోను, నెల్లూరు జిల్లాలోని దర్శి, పొదిలి, కనిగిరి, ఉదయగిరివంటి మెట్టప్రాంతాలలోనూ, తెలంగాణా ప్రాంతాలలోనూ ప్రత్తిపైరు వేస్తారు ఇతర ఆహార పదార్థాలకంటె ప్రత్తివేయుటవలన ఎక్కువ ఆదాయం వస్తుందని ప్రభుత్వపక్ష సభ్యులు ఏ ఒక్కరైనాసరే గుండెమీద చేయివేసుకొని చెప్పమని అడుగుతున్నాను. ఎవ్వరికికూడా ఎక్కువ ఆదాయంరాదు ఒక ఎకరానికి పదిమణుగుల మొదలు, మహాపండితే 20 మణుగులప్రత్తి పండుతుంది అవి మంచిభూములై, వర్షాలు సక్రమంగా ఉండి, అనువుఉండి, రోగాలు రాకుండా— ఈలాంటి సదుపాయాలన్నీ వుంటే సగటున ఎకరానికి 10 మణుగులనుంచి 20 మణుగులవరకూ పండుతుంది అంటే ఎకరానికి 20, 30 రు ల మొదలు 50, 60 రు ల వరకూ వస్తుంది ఇది పల్నాడు, దర్శి ప్రాంతాలలోని విషయం రాయలసీమలో 4, 5 మణుగులకంటే ఎక్కువ పండదు ఈ పరిస్థితులలో ఎట్టి సందర్భంలోకూడా ఎకరానికి 30, 40 రు. ల కంటే ఎక్కువ ఆదాయంరాదు ఈవచ్చినది ఖర్చులతోసహా ఖర్చులు

తీసేస్తే ఒక్కొక్క సంవత్సరం యింకా తక్కువ ఆదాయం వస్తుంది ఇదంతా ఎందుకు వేస్తారు అంటే సామాన్యరైతులు మెట్టప్రాంతాలలో 20 ఎకరాల భూమి వుంటే, ఆ ఇరువది ఎకరాలకు సరిఅయిన బలం చేయలేవు, కాబట్టి అన్ని పైరులు వేయము కాబట్టి, ఒక్కొక్కసారి పునాస పైరు, జొన్న వేస్తే పోతాయి కాబట్టి పశువులకు ప్రత్తిగింజలు కావాలి కాబట్టి, గేదెలకు కుడితె పోయాలి కాబట్టి ఎరువులు పెట్టి మంచి పంటలు పండించలేరు కాబట్టి 4, 5 ఎకరాలలో ప్రత్తివేస్తే పండినంత పండుతుంది ఎదో గేదెలకు ఎద్దులకు మేతకు పనికివస్తుంది అని వేస్తారు తప్ప దీనివల్ల ఆదాయం వస్తుందనే దృష్టితో ఎవ్వరూ పండించడం లేదు ఆదాయంకోసం యిది పండించడంలేదని స్పష్టంగా కనిపిస్తోంది ప్రత్తివేస్తే ఎకరానికి యింత అని పన్ను వేసేవారు, ఎకరానికి ఎంత ఆదాయం వస్తుందో పరిగణనలోకి తీసుకున్నారా? ఆ భూముల విలువ దృష్టిలోకి తీసుకున్నారా? ప్రత్తి తప్ప యింకే యితరమైన పంటలు పండని భూములు అనేకం ఉన్నాయి ఆహార పదార్థాలు పండించాలంటే ఆ భూములలో పండవుకూడా ఈ విషయాన్ని దృష్టిలోకి తీసుకోకుండా ప్రత్తి మీద పన్ను వేస్తామని చెప్పడం సరైనది కాదు వేరుశెనగ వేస్తే విత్తనాలు ఖర్చుకూడా రాని సంవత్సరాలు ఉంటాయని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను మంత్రివర్గంలో మెట్టప్రాంతాలనుంచి వచ్చిన మంత్రులు చాలా మంది ఉన్నారు పల్లంప్రాంతాలనుంచి వచ్చిన మంత్రులున్నారు గోపాలరెడ్డిగారు, కళా వెంకటరావుగారు ఆలోచిస్తే మెట్టప్రాంతాలనుంచి వచ్చిన మంత్రులుగా ఉన్నవారు ప్రత్తివేస్తే ఎక్కువ ఆదాయం వస్తుందని స్పష్టంగా చెబుతున్నారా? వ్యాపార పంట బట్టి పన్ను వేస్తున్నామంటున్నారు వేరుశనగ కూడా ఎకరానికి 10 మొదలు 20 మణుగులు కూడా పండని భూములు అనేకం ఉన్నాయి ఎకరానికి 16 మానికలు మొదలు 25 మానికలవరకూ వేరుశనగకు విత్తనాలే పెట్టవలసి ఉంటుంది 4, 5 మళ్ళవరకూ విత్తనాలే కావలసి ఉంటుంది అటువంటప్పుడు 4 ఎకరాలలో వేరుశనగ వేయాలంటే దాదాపు ఒక పుట్టి విత్తనాలే కావాలి ఇదేమైన దృష్టిలోకి తీసుకున్నారా? ఈ నాడు వేరుశనగ మీద అనేకరకాల పన్నులు వేస్తున్నారు ఫ్యాక్టరీల దగ్గర పన్నులు పడుతున్నాయి ఈ విషయాలన్నీ దృష్టిలోకి తీసుకోకుండా, 4, 5 సం॥ లకు ఒకసారి పండిన వాటిని దృష్టిలోకి తీసుకొని పన్ను వేస్తామనడం న్యాయంకాదు కొన్ని మెట్టప్రాంతాలలో వేరుశనగ తప్ప మరొకటి పండదు. రాయలసీమ ప్రాంతంలోనూ, దర్శి, పొదిలి, కనిగిరి ప్రాంతాలలో యిసుక దిబ్బలుగా ఉండి, మరే పైరు కానటువంటి భూములలో వీటిని వేయడం జరుగు

తోంది ఈ విషయాలను వేటినీ ప్రభుత్వం గమనించకుండా పన్నులు వేయడం అనేది ఘోరమైన విషయం తప్ప, మరొకటి కాదు

ఇక నాటుపొగాకు విషయం చూడండి సాధారణ రైతులు, తమ కుటుంబంలోనూ, తమ పాలేరులకు వాడుకొన్న తరువాత, దానధర్మంగా యిచ్చుకొనే పంటయిది దీనిని మెట్టప్రాంతంలో కొంతమంది 1, ½ ఎకరం వేస్తుంటారు దీనిమీద ఏటేటా పన్నులు పెంచుతున్నారు క్రిందటి సంవత్సరం యీ నాటు పొగాకుమీద పన్ను 180 రూ॥ లపై చిల్లరవుంటే యీనాడు కేంద్రప్రభుత్వం 225 రూ॥ ల వరకూ పెంచింది ఇది రైతులకు గిట్టకనే **godowns** లోకి తోలి, ధరరాక నష్టపడుతున్నారు ఈ నాటు పొగాకుమీద "మేము వదిలేదిలేదు" అని కేంద్రప్రభుత్వం పన్ను కట్టమంటున్నది 3, 4 కుటుంబాలున్న రైతులు ఒక సంవత్సరానికి ఎట్లాలేదన్నా 3, 4 మళ్ళ పుగాకును త్రాగుతారు 1, 2 ఎకరాలలో పండిన పొగాకు అయితేగాని వారికి, వారి పాలేరులకూ సాధారణంగా సరిపోదు దానిమీద కేంద్రప్రభుత్వం వేసే **excise duty** కాక మళ్ళా "మేము ఎకరానికి యింత అని విధిస్తున్నాం, అది కట్టి మరీమీరు పొగాకు త్రాగండి, మీరు పండించిన పొగాకు అయినాసరే, మీరు పండించిన వేరుశనగకాయలు అయినాసరే ముందు మాకు పన్ను చెల్లించండి, ఆ తరువాత విత్తనాలకు పెట్టుకోండి మీరు పండించిన ప్రత్తి అయినాసరే, పన్నుకట్టి నూలు తీయించి, గుడ్డలు కట్టుకోండి" అనే స్థితిలోకి మన ప్రభుత్వం వస్తోంది ఇది చాలా ఘోరమైన విషయం.

ఇదేవిధంగా **mixed crops** విషయంలో కూడా జరుగుతున్నది ఈనాడు పునాస పైరుగా జొన్న వేస్తారు వర్షాలులేక శ్రావణమాసం వచ్చేసరికి అవి చచ్చిపోతే, రెండు కారులూ ఊరికనే పోతుందని 3 సాళ్ళకు ఒకసాలో, 4 సాళ్ళకు ఒకసాలో ప్రతి సంవత్సరంకూడా వేస్తారు ఈ పంట అయినా పండుతుందేమో అనే ఆశతో వేస్తారు సాధారణంగా అది పోతూనేఉంటుంది ఒకటి పోతేనే రెండవపంట వేస్తారు. అది **mixed crop** కాబట్టి దానిమీద పన్ను వేస్తామంటున్నారు. కొర్ర, ప్రత్తి, వేరుశనగ, ప్రత్తి; వేరుశనగ, కంది, సజ్జ, ప్రత్తి యిలా అనేక రకాలుగా **mixed crops** వేస్తూంటారు. ఒక పైరు పోతే, యింకొకటైనా పండుతుందనే దృష్టితో యివన్నీ వేస్తాము. ఈ విషయాలు తెలియకుండా పన్నులు వేయడం న్యాయంకాదు. సజ్జ అంటే ఏమిటో తెలియదు జొన్నఅంటే తెలియదు. అవి ఎట్లా కలుపుతారో తెలియదు. ఎకరానికి ఎంత పండుతుందో, ఏమిటో తెల్సుకోకుండా, తెల్సినటువంటి, మెట్ట

ప్రాంతాలనుంచి వచ్చిన సభ్యులను ఎంత ఆదాయం వస్తుందని అడిగి తెల్సుకోకుండా పత్రికలలోనూ, కాగితాలలోనూ ఇన్ని వేల ఎకరాలు, ఇన్నిలక్షల ఎకరాలలో వేస్తారని ఉన్నది, కాబట్టి మేము ఎకరానికి యింత వేస్తే యిన్ని లక్షల రూపాయల ఆదాయం వస్తుంది, దీనితో మా పంచవర్ష ప్రణాళిక జయప్రదం అవుతుంది కాబట్టి మీరు యీ పన్నులన్నీ భరించండి అనే స్థితిలో యీనాడు పన్నులు వేస్తున్నారు కాని, రు 100 లు శిస్తు కట్టేవారికి యీ రెండు సంవత్సరాలలోనూ ఏన్ని పన్నులు వేశామో లెక్కలు చెబుతాను రు 100 లు కట్టేవారికి standardisation క్రింద 100×2 అణాలు చొప్పున రు 12½ లు వేశాము రు 100 లమీద రూపాయికి 0-0-9 చొప్పున సెస్సులు పెంచితే 4-11-0 అయినది 12½% standardisation క్రింద 5 అణాల చొప్పున సెస్సులు వేస్తే రు 3-14-6 అయినది మొత్తం 121 రు. అయినది 100 కి రు 0-4-0 చొ॥న సర్చార్జి పెంచితే 30-4-6 అయినది, అంటే రు 151-6-0 అయినది, రు 100 లు శిస్తు కడితే అతనికి 40,50 ఎకరాలు ఉంటుంది దాంట్లో 20 ఎకరాలలో వ్యాపార పంటలు వేస్తాడు. దానిమీద ఎకరానికి రు. 2 ల చొ॥న వేస్తే 50 రు లు దానిమొత్తం special assessment మీద cesses కడితే మళ్ళీ 15-10-0 అయినది ఈ రెండు సంవత్సరాలనుంచి మనంచేసిన బిల్లులవల్ల రు 100 లు శిస్తుకట్టేవారు రు 220లు శిస్తు కట్టాలని పన్నులు వేశారు ఇది 'కాదు' అని ఎవరైనాఅనగలరా? రు 50లు శిస్తు కట్టే మామూలు పేదరైతులకు 100 రు ల వరకూ శిస్తు పెంచారు కళా వెంకటరావుగారు, గోపాలరెడ్డిగారు పల్లపు ప్రాంతాలనుంచి వచ్చారు కాబట్టి మెట్టలో 4 వ వంతు తీసుకొని వేయాలంటున్నారు. ఇక్కడకు వచ్చేసరికి, wet assessment వేశాము, కాబట్టి surcharge తగ్గించమంటున్నారు లెక్కలు తీయండి మెట్టప్రాంతాలలో commercial crops మీద పన్ను వేసినప్పుడు దీనిని 4వ వంతు ఎందుకు చేయవలసి వచ్చింది? ఆర్థికశాఖా మంత్రిగా ఉన్న గోపాలరెడ్డిగారు, పల్లపు ప్రాంతంనుంచి వచ్చిన కళా వెంకటరావుగారు వారిద్దరూకలిసి చేసినపనితప్ప మరొకటి కాదని నేను స్పష్టంగా అభిప్రాయపడుతున్నాను ఈ పన్నులను జనసామాన్యం అంగీకరించే స్థితిలోలేదు 100 రు. లకు 200 రు. లు అయినది నిన్న నేను బజారుకు వెళ్ళినప్పుడు ఒకరు "మన ప్రభుత్వంవారు అన్నిటిమీద పన్నులు వేశారు ఇంకా ఏమి మిగిలినాయయ్యా" అంటే ఇంకొకరు "ఇంక సంతానోత్పత్తిమీద ఖర్చుపన్ను. సంతాననిరోధంమీద ఆదాయపు పన్ను వేస్తారు, ఈ రెండుపన్నులూ వేస్తారు" అంటున్నారు. సంతాననిరోధం అయినందుకు, ఉత్పత్తి అయినందుకు కూడా పన్నులు వేస్తారనే పరిస్థితులు యీనాడు కనబడుతున్నాయి

అందుకని దీనిని అందరూ వ్యతిరేకించవలసిన అవసరం యున్నది ముఖ్యంగా రాయలసీమ ప్రాంతాలనుంచి, మెట్ట ప్రాంతాలనుంచి వచ్చిన మిత్రులు—ప్రతిపక్షం, ప్రభుత్వపక్షములకు చెందినసభ్యులందరూ వ్యతిరేకించి-ముఖ్యంగా ప్రత్తి, వేరుశనగ మీద పన్నును మినహాయించేటట్లు చూడవలసిన అవసరం యున్నది మిగతా పంటలకుకూడ - కొంత విస్తీర్ణం మినహాయించి పెద్దవారి మీద, వందలు, వేలు ఎకరాలు వున్నవారి మీద ఒక gradation పద్ధతిలో పన్ను వేస్తే మాకు ఆక్షేపణలేదు అలా వేయాలని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను

శ్రీ పి వెంకటసుబ్బయ్య (రాజంపేట-రిజర్వుడు) అధ్యక్షా, నాగిరెడ్డి గారు మాట్లాడుతూ, సజ్జ, జొన్న, కొర్రలు - అంటే ఏమిటో తెలియనివారు కూర్చొని, ఈ బిల్లులు తయారు చేశారని అన్నారు కాని సెలక్టు కమిటీలో మెట్ట ప్రాంతాలనుంచి వచ్చిన సభ్యులు కూడాఉండి, ఆయా విషయాలన్నిటి మీద తర్జనభర్జనలు జరిగిన తరువాతనే, ఆ నిర్ణయాలు చేశారు

మిస్టర్ స్పీకర్ . అది మంత్రిగారు చూచుకుంటారు

శ్రీ యమ్ సత్యనారాయణరాజు (చీపురుపల్లి-జనరల్) అధ్యక్షా, ఈ సెషన్‌లో పన్నులు వేసే బిల్లులలో Commercial Crops (Assessment) Bill మూడవది అభివృద్ధి ప్రణాళికలకోసం యీ పన్నులు వేస్తున్నారు ఈ పన్నులు వేసేటప్పుడు రైతులకు కలుగజేయవలసిన సౌకర్యముల విషయమై, ప్రభుత్వం కొంత బాధ్యత తీసుకుంటే బాగుండేది నీటి తీరువను గురించి - నీరు సప్లయి చేస్తున్నాము కాబట్టి, దానికి కొంత ఖర్చు ఉన్నది కాబట్టి - additionalగా పన్ను వేస్తున్నామంటే సబబుగా ఉంటుంది కాని వాణిజ్య పంటలు పండించేవారికి ఏమి సహాయం చేయుటకు యీ పన్నులు వేస్తున్నారో అర్థంకావటంలేదు ధరవరలు గురించి ప్రభుత్వం శ్రద్ధతీసుకుంటున్నదా ? ఈ పంటల అమ్మకం విషయంలో ప్రభుత్వం సహాయం చేస్తున్నదా ? అటువంటి బాధ్యత లేమీ తీసుకొనకుండా, కేవలం ప్రకృతిమీద ఆధారపడి రైతులు పండించుకునే పంటమీద సుంకము వేయుట అన్యాయమని చెప్పుటకు సాహసిస్తున్నాను. ఈ షెడ్యూలులో చూపించిన పంటలలో, పంచదార sugar cane మీద తప్ప, తతిమ్మా వాటిమీద ప్రభుత్వ అజమాయిషీ లేదు కాబట్టి అటువంటివాటిమీద పన్ను, ఏమాత్రం వేయటానికి వీలులేదని మనవి చేస్తున్నాను మన రాష్ట్రంలో పండే చెరుకు పంటలో ౬ వ వంతే పంచదార

మిల్లులకు పోతుంది మిగతా నాలుగు వంతులు, బెల్లముగా తయారవుతుంది బెల్లము ధరలు నిలకడగా లేనందున రైతులు చాల యిబ్బందిపడుతున్నారు మిర్చి, పసుపు ధరలుకూడ అలాగే ఉన్నవి వీటిమీద ప్రభుత్వ అజమాయిషీ లేనప్పుడు, యీ విధంగా పన్నులు వేయటం, రైతుకు చాలా భారంగా ఉంటుంది మిర్చి 10 సెంట్లకంటె పైన వేసుకుంటే పన్ను పడుతుందన్నారు. మామూలుగా రైతుకు, తన కుటుంబం నిమిత్తం స్వంత వాడకమునకు అధమ పక్షం ఒక ఎకరము వరకైనా వేస్తేగాని సరిపోదు కొన్ని పూర్తిగా పండని భూములు ఉంటాయి కాబట్టి 10 సెంట్సు అంటే, చాలా అసందర్భంగా ఉంటుంది ధరవరలనుబట్టి, పరిస్థితులను గమనించి కొంత పరిమితివరకు పన్ను వేయకుండా ఉండటం చాలా మంచిది వెనుకటి హైదరాబాదు ప్రభుత్వం Agricultural Income tax నిమిత్తం కొంత land ను ఒక యూనిట్‌గా పెట్టారు ఇప్పుడుకూడ అటువంటి యూనిట్ తీసుకొని అంతకుపైన భూమి యందు వాణిజ్య పంటలు వేస్తే, యీ పన్ను వేయటం సబబుగా ఉంటుంది భూసంస్కరణలు వచ్చేవరకైనా మూడురెట్లు, నాలుగురెట్లు ఉన్న కమలతాకు, అంతకుపైన ఉన్నదానికి ఈ షెడ్యూలు రేట్సుకు రెట్టింపు వేస్తే ప్రభుత్వానికి మంచి ఆదాయం వస్తుంది Agricultural Income tax తీసివేసినారు కాబట్టి ఆ ప్రకారం చేస్తే బాగుంటుందని సూచిస్తూ యింతటితో సెలవు తీసుకుంటున్నాను

శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు (చొప్పదండి) అధ్యక్షా! ఈ సమావేశములో పన్నులు వేయుటకు తెచ్చిన బిల్లులలో, కమ్మర్షల్ క్రాప్స్ బిల్—మూడవది దీనిమీద చాల దీర్ఘమైన చర్చలు జరుగుతున్నవి సెలెక్టు కమిటీలో కూడ, దీనిమీద చర్చజరిగినది ప్రతిపక్షంనుంచి కొన్ని సవరణలు యిచ్చాము కాని వాటిని అంగీకరించలేదు అసలు యీ పన్నువేయుటకు అనుసరించే విధానం, పాతకాలమునాటి ప్రభుత్వ విధానంవలె గాక, కాంగ్రెసు ప్రభుత్వం వచ్చిన తరువాత మొత్తము భారతదేశమునకంతకు ఒక సిద్ధాంతాన్ని మూలాధారంగా పెట్టుకొని దానికి అనుగుణ్యంగా అన్ని వ్యవహారాలు, విధానాలు నడుపుతారని కాంగ్రెసు నాయకులు ప్రచారం చేస్తున్న సందర్భములో, మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడ యిటువంటి పన్నుల బిల్లులు తయారు చేసేటప్పుడు ఒక రాజకీయ విధానాన్ని, దృక్పథాన్ని స్పష్టంగా అనుసరిస్తుందనుకొనటము జరిగింది ఆ విధంగా ఆశించాము కాని ఆచరణలో చూస్తే, సాధారణంగా యిదివరకు, పాతకాలం ప్రభుత్వాలు ఒక స్పష్టమైన దృక్పథం, విధానం లేకుండా ఎప్పటికప్పుడు అవసరాన్నిబట్టి పన్నులువేసి ఆదాయాన్ని రాబట్టే

ఒక బండ పద్ధతిలో పోయినమాదిరి, యిప్పుడుకూడ పోతున్నారేగాని, అభివృద్ధి కరమైన ఒక సిద్ధాంతాన్ని, విధానాన్ని అనుసరించి వ్యవహరించుటలేదు ఇది చాలా విచారకరమైన విషయం

కేంద్ర ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాల మధ్య కోఆర్డినేషన్ ఉన్నప్పుడు పనులుకొంతసులభంగా జరగడానికి అవకాశంఉంటుంది కేంద్రప్రభుత్వం ఈసంవత్సరం గత సంవత్సరం కన్న ఆదాయం ఎక్కువ చేసుకున్నది 1956-57 వ సంవత్సరంలో 483 కోట్ల రూపాయల ఆదాయం వస్తే ఈ సంవత్సరం 576కోట్ల ఆదాయం వచ్చింది అంటే 93 కోట్ల రూపాయలు పెంచుకోగలిగింది దాని వల్లనే కొన్ని ప్రణాళికలు అమలుజరపడం సాధ్యమయింది అయితే రాష్ట్రముల ఆదాయం కూడా పెరగవలసిఉంది రాష్ట్రప్రభుత్వ బడ్జెటులలో సాధ్యమైనంత వరకు లోటులేకుండా చూచుకోవాలి ఇందుకు గాను సక్రమమైనటువంటి విధానం రాష్ట్రప్రభుత్వాలు అనుసరించవలసి ఉంది టాక్సేషన్ ఎంక్వైరీ కమిటీ రిపోర్టు వచ్చినతరువాత చాలమంది ఆర్థిక నిపుణులు వారి అభిప్రాయాలను తెలియచేశారు ఈ మధ్యన డాక్టర్ కోల్డార్‌గారు మన ఆర్థిక వ్యవస్థను గురించి యిచ్చిన నివేదికను మూలాధారంగా తీసుకొని కొన్నిమార్పులు జరిపే విషయం విచారింపబడుతున్నట్లు వినవస్తున్నది. ప్రభుత్వానికి రావలసిన ఆదాయంపన్నులో దాదాపు రెండు మూడు వందల కోట్ల రూపాయలు రావడంలేదని అంచనా వేయబడింది పెద్ద పెద్ద పెట్టుబడిదారులు ఫ్యాక్టరీ యజమానులు యితర ధనికుల నుంచి యింత పెద్దమొత్తము వసూలుకావడంలేదు ఈవిధంగా సంభవిస్తున్న ఎగవేతలను అరికట్టడానికి సర్వవిధాల ప్రయత్నాలు జరగవలసిఉన్నది కేంద్రప్రభుత్వము వెల్తు టాక్సు ద్వారా 15, 20కోట్ల రూపాయలు సంపాదించదలచింది ఎక్స్‌పెండిచర్ టాక్సు ద్వారా 10, 15కోట్ల రూపాయలు సంపాదించ అంచనా వేసింది. ఇంతమాత్రమే చాలదు భాగ్యవంతులు కట్టవలసిన పన్నుల నన్నిటిని ఏదో ఒకవిధంగా వసూలుచెయ్యాలి వ్యక్తుల సంస్థల అధిక ఆదాయాలను అరికట్టడానికి కొలతబద్దలను ఏర్పాటుచేయాలి

ప్రజల దైనందిన జీవితానికి అవసరమైన ఎన్నో కార్యక్రమాలను అమలు జరపవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వమునకు ఉన్నది కాబట్టి రాష్ట్రప్రభుత్వాల ఆర్థిక వ్యవస్థను పటిష్టముచేసే విధానం కేంద్రప్రభుత్వం అవలంబించవలసిఉన్నది ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని రాష్ట్రప్రభుత్వాలకు సరియైన వాటాలు కేటాయించాలి కాంగ్రెసు మంత్రివర్గం ఎంతసేపు పేదప్రజల మీదనే పన్ను వేయడానికి ప్రయత్నిస్తుంది అని మేము చెప్పడం, పేదసాదలకు ఈ పన్నులు

వర్తించవని వారు చెప్పడం పరిపాటి కానక్కరలేదు దేశంలోని ప్రజాసామాన్యము యొక్క జీవనస్థాయిని పెంపొందించడానికి ఏ రాజకీయ సిద్ధాంతాన్ని ప్రభుత్వం అమలుజరుప నిశ్చయించింది? అందుకు అవలంబించవలసిన ప్రణాళిక లేవి ? అనేవి మంత్రిగారు చెప్పవలెనని కోరుతున్నాను సోషలిస్టుసమాజనిర్మాణ మని సోషలిస్టుతరహా సమాజనిర్మాణమని చెప్పినంతమాత్రంచేత లాభంలేదు ఏ కార్యక్రమాలు, ఏ విధానాలు, ఏ ఎత్తుగడలు,ఏ ప్రణాళికలు అమలుపరచి, మన ఆర్థిక వ్యవస్థను చక్కబరుస్తారనేది ప్రభుత్వమువారు వివరంగా తెలియజేయాలి. అంతేనే కాని మాకు మెజారిటీ ఉన్నది, మా పద్ధతి మేము అవలంబిస్తాము అని ప్రజాభిప్రాయాన్ని తోసివేసే రోజులు కావివి మనము యిక్కడ మాట్లాడే మాటలు భారతదేశం వింటున్నది ఆంధ్ర ప్రజానీకం అంతా వింటున్నది ఏ సమాధానం చెప్పినా సరిపోతుందనే భావంతో కాకుండా బాధ్యతతో ప్రజా హృదయాన్ని అర్థంచేసుకుని సమాధానం యివ్వాలని మంత్రిగారిని కోరు తున్నాను

మిస్టర్ స్పీకర్ సిద్ధాంతాల మీద కాకుండా అసలు విషయం గురించి మాట్లాడితే బాగుంటుంది.

శ్రీ కె వెంకటరావు సిద్ధాంతముల గురించి చెపితే మాకేమి నష్టము లేదు. సిద్ధాంతాల గురించి వారూ చెపుతున్నారు, మేమూ చెపుతున్నాము కాని ఇంకొకరు బూటకులని, మనమే మంచివాళ్ళమని అనుకోవడం పొరపాటని మాత్రం చెపుతున్నాను

మిస్టర్ స్పీకర్ సిద్ధాంతాలగురించి మాట్లాడినా ఎవరుకూడా ఎక్సైటు కాకూడదు.

శ్రీ సి హెచ్. రాజేశ్వరరావు మనకు ఒక ఖచ్చితమైన ప్రణాళిక వుండాలి ఉత్పత్తి అధికం కావడానికి సక్రమమైన కార్యక్రమాలు అమలు జరపాలి ఏవర్గంపై పన్ను వేయాలి, ఏ వర్గంద్వారా ఆదాయం పెంపుచేసుకుని ఏ వర్గాన్ని పైకి తీసుకుని రావాలనే విషయం మనము స్పష్టముగా ఆలోచించు కోవాలి. ఈ సమావేశంలో రైతులపై ఎన్నో పన్నులు వేయబడ్డాయి అయితే సామాన్యరైతు వాటిని చెల్లించుకోగలడా అనేది సందేహాస్పదము ఈ కమర్షి యల్ క్రాప్స్ టాక్సెస్ వల్ల చిన్న రైతులకు ఎంత నష్టము సంభవిస్తుందో నాగిరెడ్డిగారు మొదలైన మిత్రులు చెప్పారు. తమకు పండిన కొద్దిపాటిపంటలను

అమ్ముకొని అందుమూలంగా వచ్చే డబ్బుతో కాలం గడుపుకొనే సామాన్య రైతులపైన అనాటికానాడు పన్నులు పెంచి, ఈ ప్రణాళికలంటే భయపడే స్థితికి వారిని తీసుకొనిరావద్దని చెపుతున్నాను అందువల్లనే వారి వారి ఆదాయాలను బట్టి పన్నులు విధించడమనేది సక్రమమైన పద్ధతి దీనివల్ల మన మూహిస్తున్న సోషలిస్టు తరహా సమాజ నిర్మాణము సాధ్యమవుతుంది రైతాంగం మీద ఈ విధంగా డైరక్టు టాక్సెస్ వేసేకన్న అందరికీ వర్తించేటట్లు ఇన్‌డైరక్టు టాక్సెస్ వేసినట్లయితే వారివారి కొనుగోలు శక్తినిబట్టి పన్నులు యిచ్చుకోవడం సాధ్యమవుతుంది ఈ ప్రణాళికల వల్ల వాళ్ల జీవితస్థాయి పెరగడానికి అవకాశం ఉంటుంది కమర్షియల్ క్రాప్స్‌పై పన్ను విధించడం అభివృద్ధికరమైన విధానం కాదని మంత్రిగారు అంగీకరిస్తున్నారు. కాబట్టి తొందరపడి ఈ టాక్సును వేయవలసిన అవసరం ఏమి వచ్చిందని అడుగుతున్నాను

_ అగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సు చట్టములో లోపాలువుంటే, ఒకటి రెండు సంవత్సరములలో సమగ్రం చేసుకొని యీ భూమిశిస్తు విధానం మార్చి, యింకా పటిష్ఠం చేయుటకు అవకాశములు లేకపోయినవా ? అటువంటి అవకాశములు ఉన్నప్పుడు ఆ చట్టాన్ని వెంటనే ఆంధ్రకుకూడ వర్తింపచేసి దానిని **basis** గా తీసుకొని **progressive taxation** అమలులో పెట్టకుండా, యీ వాణిజ్యపంటల పన్నులు, సర్‌చార్జీలు తీసుకువచ్చి **retrograde step** ఎందుకు వేస్తున్నారని మంత్రిగారిని అడగక తప్పదు ఈ విధంగా చేయుటవలన ఆదాయం ఎక్కువరాదు అగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సు గురించి నేను వేరే వివరంగా చెప్పవలసిన అవసరం లేదు సెలెక్టుకమిటీలో మంత్రిగారు అంగీకరించారు ఇక్కడకూడ స్పష్టంచేశారు అది **progessive taxation system** ఈ పన్నులు ఏమీలేకుండా దానిని తీసుకురావలసిన అవసరం యున్నదని మనవి చేస్తున్నాను

కేంద్రప్రభుత్వంనుంచి, రాష్ట్రాలకు రావలసిన వాటాగురించి ప్రభుత్వానికి కొన్ని విషయాలు మనవిచేయవలసిన అవసరం ఉన్నది కేంద్రప్రభుత్వం మొత్తం ఇన్‌కంటాక్సు, సూపర్‌టాక్సు, సర్‌చార్జీలలో **highest slab** ను 91 8 నుంచి **84%** వరకు తగ్గించటం జరిగింది అందువల్ల ఆ ఆదాయం 7 నుంచి 5 కోట్లవరకు తగ్గిందనేవిషయం స్పష్టంగా కనబడుతున్నది. **Additional surcharge,** ఇన్‌కంటాక్సుపై వేయడంలో, ఆ విధంగా **highest slab** లో **rate of tax** తగ్గించటంవల్ల 15 కోట్ల రూపాయల ఆదాయం తగ్గింది. **Wealth Tax** వల్ల 15 నుంచి 25 కోట్లరూపాయలు, **Expenditure tax** వల్ల

10 నుంచి 15 కోట్ల రూపాయలు కేంద్రానికి వస్తాయని అనుకొన్నప్పుడు ఈ రెండు పద్ధతులవల్ల ఇన్‌కంటాక్సు ఎగవేతను పూడ్చుకొనుటకు పన్నులు వేశామని కేంద్రప్రభుత్వం స్పష్టంచేసినపుడు ఆ ఆదాయంనుంచి మనరాష్ట్రానికివాటా ఎందుకు ప్రత్యేకించటంలేదు ? Expenditure tax, wealth tax ఈ రెండింటి నుంచి రాష్ట్రాలకు వాటా రావాలని కేంద్రప్రభుత్వానికి బొంబాయి ప్రభుత్వం మెమోరాండం సమర్పించినట్లు తమకు వాటారావాలని కోరినట్లు పత్రికల ద్వారా తెలుస్తున్నది దానినిగురించి మన ప్రభుత్వం ఏమి ఆలోచించింది ? కేంద్రప్రభుత్వానికి మెమోరాండం సమర్పించినదా ? దాని పరిస్థితి ఏమిటో మంత్రిగారు సెలవివ్వాలని కోరుతున్నాను

ప్రత్యేకంగా తెలంగాణా ప్రాంతంలో పన్నులవిధానం, ఆర్థికపరిస్థితి ఎల్లాయున్నదో చెప్పి ముగిస్తాను ఇక్కడ ఖుష్కీతరీ భూములకు, రేట్లు ఎక్కువ ఉన్నవని మంత్రిగారుకూడ అంగీకరించారు అక్బర్ కాలంనాటి, మంత్రి తోడర్‌మల్ యొక్క పన్నులవిధానమే ఉన్నది అది fundamental గా మార్చబడలేదు కొన్ని revisions జరిగి మార్పులు జరిగినా, చాలా ప్రాంతాలలో కరుడుకట్టిన పాతకాలపు పన్నుల విధానమే ఉన్నది మొత్తం భారత దేశంలోనే కాకుండా, ఆంధ్రప్రాంతం కంటె, తెలంగాణాలో ఎక్కువ పన్నులున్నవి Irrigation facilities కూడ తక్కువ ఆంధ్రలో నూటికి 30 6 ఎకరాలుంటే, తెలంగాణాలో నూటికి 14 ఎకరములవరకే నీటిపారుదల సౌకర్యము లున్నవి. వాటిలో నూటికి 17 ఎకరాలవరకు ఆంధ్రలో కాల్వలద్వారా, తెలంగాణాలో 2 ఎకరాలవరకే కాలవలద్వారా నీరు అంది, సేద్యం జరుగుతున్నది తెలంగాణాలో guaranteed water sources లేవు ఈ విధంగా చెప్పటము, ఆంధ్రకు తెలంగాణాకు పోటీ పెట్టటంకాదు వెనుకబడిన తెలంగాణాలో పరిస్థితులు ప్రభుత్వదృష్టికి తేవటమే నా ఉద్దేశం. అటువంటి పరిస్థితులలో సర్‌చార్జీలు, వాణిజ్యపంటలమీద పన్నులు వేస్తున్నారు Irrigation sources లేక బావులు, ఏతాంలు, బొందలు, అనేక పద్ధతులద్వారా నీరుతెచ్చి సేద్యం చేస్తున్న పరిస్థితులలో,—ఆంధ్రలోను, తెలంగాణాలోను ఒకేపద్ధతిపై పన్నులు వేయుట సరైనవిధానం కాదు ఆంధ్రలోకూడ, మెట్ట, మాగాణి ప్రాంతాలలోని ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకొనకుండా జనరల్‌గా పన్నులు వేస్తూపోవుట సరైనది కాదని చెప్పకతప్పదు. Land revenue system ను సంస్కరించి, progressive taxation విధానం, Agricultural Incom tax తీసుకువచ్చి, యీ indirect పన్నులు తీసివేసి, ఆ విధంగా అంచెలవారీగా యీ విధానాన్ని మారుస్తామని చెప్పినట్లయితే ప్రతిపక్షంవారు కూడ, ప్రభుత్వంతో

ఏవిధంగా సహకరించి, పన్నులవిధానంలో మార్పు తేవాలో, ఆలోచించుటకు అవకాశం ఉంటుంది ప్రతి దానికి వేరువేరుగా పన్నులు వేస్తూ, యిది 'మా పాలసీ' అంటే, ఆ విధానం ఎవరినీ ఆకర్షించదు ప్రతిపక్షం సహాయం చేయుటకు, ప్రజలసేవ చేయుటకు అవకాశం కల్పించినవారు కారు అనవసరంగా వ్యతిరేక భావాలు రెచ్చగొట్టినవారు అవుతారు దీనివలన పరిస్థితులు చెడతాయి కాబట్టి, ప్రభుత్వంవారు serious గా ఆలోచించి స్పష్టమైన progressive taxation విధానం ప్రకటించి అమలుచేయాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, ఈ శాసనసభలో రాజేశ్వరరావుగారు పెద్ద ఉపన్యాసం చేయుట, యిదే మొదటిమారు అనుకుంటాను వారి మనస్సులో ఉన్న విషయాలన్నీ శాస్త్రరీత్యా యివాళ మనవిచేశారు

*Mr Speaker* He is too learned, and unfortnately, I could not give him more time today

* శ్రీ కె వెంకటరావు వారికి తెలిసిన విషయాలు చెప్పటానికి సమయానుకూలంగా టైము యివ్వాలి, వారు చెప్పాలి, మేము వినాలి, దానివల్ల బాగుపడాలి కాని యివాళ బిల్లుసందర్భంలో మాట్లాడుతూ, Expenditure Tax ఎందుకువేశారు కాదని, దానికి కేంద్రప్రభుత్వానికి ఏమి మెమోరాండం పంపించారని, వీటన్నింటికి సమాధానం చెప్పమని కోరితే, యిప్పుడు చెప్పటానికి సాధ్యంగాదని సవినయంగా మనవిచేస్తున్నాను ఇటువంటి విషయాలు సప్లిమెంటరీ గ్రాంట్సు వచ్చినప్పుడో, బడ్జెటు సందర్భంలోనో వారు అడగటం, మేము సమాధానాలు చెప్పటం, సరైనపద్ధతి వారు ఆఖరున ఒకముక్క అన్నారు ప్రభుత్వం ఆంధ్రతెలంగాణాలకు సంబంధించి ఒకేపన్నువిధానం తీసుకువస్తుందని చెపుతున్నారు కనుక, ఆ స్వరూపం ఏవిధంగా ఆలోచిస్తున్నారో వివరించమని, ఒకప్రశ్న వేశారు. ఈ విషయంగురించి నేను యిదివరకే మనవిచేశాను రెండుచోట్లకూడ, scientific గా రేట్సు లేవనేదానికి చర్చ అక్కరలేదు కొన్ని కొన్ని individual cases లో, యీ basis of assessment తప్పుగా ఉన్నది. ఈ రెండుప్రాంతాలలో ఉన్న పద్ధతులను సమన్వయం చేయుటంకోసం యత్నం చేస్తున్నామని, దానికి ఒకకమిటీ వస్తుందని మనవిచేశాను త్వరలో ఆ కమిటీకి Terms of Reference యిచ్చి, ఒక స్వరూపం కల్పించి, సమగ్రంగా పన్నుల విధానంలో తీసుకురావలసిన మార్పులు తీసుకువచ్చే యత్నం చేస్తున్నామని నేను మళ్ళీ మనవి చేస్తున్నాను.

ఇప్పుడు శ్రీ పి సత్యనారాయణగారు చెప్పినట్లు ఇక్కడ ఉన్నవి రెండే విషయాలు ఒకటి ఎగ్జంప్షన్స్, రెండు గ్రెడేషన్స్ వారు గ్రెడేషన్స్ అని అన్నారు గ్రెడేషన్స్ అంటే, గ్రాడ్యుయేటెడ్ టాక్సేషన్ అని వారి ఉద్దేశం అయిఉంటుంది ఈ రెండింటి గురించి మనం ఇన్నాళ్లు చర్చించుకొంటున్నాము ఈ రెండింటిగురించి నేను ప్రతిసారి సమాధానంచెబుతున్నాను బేసిక్ ఎగ్జంప్షన్స్ ఎంత పెట్టగలమన్నది, సీలింగ్ ఎంత ఉండాలో తేలిన తర్వాత తెలుస్తుంది దాని గ్రెడేషన్ ఎలా వేసుకోవాలన్న విషయం కూడ అప్పుడే తేలుతుంది మనం నిర్ణయించుకొనినదాన్ని బట్టి అది ఉంటుంది "మనం ఏవిధంగా పన్నులు వేయాలి, ఇన్ని పన్నులు అక్కరలేకుండా ఒకేరకంగా పన్ను వేసుకొంటే బాగుంటుందా" అన్నది విచారణీయమైన అంశము కాని ప్రతి బిల్లులోను, గ్రెడేషన్ ఇన్‌డైరక్టుగా ఇంట్రడ్యూస్ చేయటం ప్రభుత్వానికి ప్రస్తుతం ఇష్టం లేదు , అని నేను తిరిగి మనవిచేస్తున్నాను "మీకు బీదవాళ్ల మీద ప్రేమలేదు , మీరు భాగ్యవంతులకు అనుకూలంగా చేస్తున్నారు"అని సామాన్యంగా ప్రతివారు చెబుతున్నారు ప్రతిపక్ష సభ్యులు ఎక్కువగా చెప్పే విషయం ఇదే దానికి నేను ఒకటే ఉదాహరణ మనవిచేస్తాను, 400 ఎకరాలు ఉన్నటువంటి నా సోదర సభ్యులు టి. రామచంద్రారెడ్డిగారు ఇవాళ బీదలగురించి అంత గట్టిగా మాట్లాడటం, ప్రతిపక్షాలు పెద్ద హర్షధ్వానాలు ప్రకటించటం బట్టి చూస్తే, పన్నులు వేసే విధానంలో బీదలమీద వారికి ఎంత అమితమైన ప్రేమఉందో ప్రతిపక్ష సభ్యులకు రుజువుఅవుతుందని అనుకొంటాను నిన్న శ్రీ రామారెడ్డిగారు ఒక పద్యం చదివారు, దానికి నేను సమాధానం చెప్పవలసిన అవసరంలేదు. అంత దూరం నేను వెళ్లవలసిన అవసరంలేదనుకొంటాను

కొందరు సభ్యులు మెరకభూమి మీద పన్ను పడుతోందన్నారు. నిజమే, మెరక భూమి మీద పన్ను పడుతోంది, పల్లపు భూమి మీద పన్ను వేయకుండా ఒక్క మెరకభూమి మీద మాత్రమే వేస్తే విమర్శించవచ్చును కాని అవిధంగా జరగలేదు. ఇప్పుడు వేసిన టాక్సేషన్ లైట్‌టాక్సేషన్ కేవలం వానమీద ఆధార పడే పరిస్థితులు మెరక భూములలో ఉంటాయి గనుక, ఏ బిల్లులలోను పెట్టనటు వంటి ఒక క్లాజు యీ బిల్లులో పెట్టుకోవటం జరిగింది పురుగుపట్టిగాని, లేక ఏ కారణాలవల్లనైనా పంట చెడిపోతే, లేదా ధరలు పడిపోతే, ఆ పంటమీద ఒక ఏడాదివరకు పన్ను వేయికుండా చేసే అధికారాన్ని ప్రభుత్వం తీసుకున్నది. అందు కొరకు యీ క్లాజు యీ బిల్లులో పెట్టటం జరిగింది ఇప్పుడు యీ బిల్లులో ఇచ్చిన లిస్టులో ఉన్న పంటల యొక్క ధరలు పడిపోయినా, పంటలు చెడిపోయినా, పన్ను విధించకుండా ఉండేందుకు యీ క్లాజుద్వారా అధికారాన్ని ప్రభుత్వం

తీసుకొన్నది, అని నేను మనవిచేస్తున్నాను "ఈ ఏడు వాన కురవలేదు, వేరు సెనగ పండలేదు" అని చెబుతున్నారు అటువంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు, ఆ పంట మీద పన్ను వేయకుండా ఉండేందుకు తగిన చర్యలు తీసుకొనేందుకు అవసరమైన అధికారం ప్రభుత్వానికి ఉండాలనే ఉద్దేశంతో ఆ క్లాజును యీబిల్లులో పెట్టాము అని సభ్యులతో మనవిచేస్తున్నాను "ఎంత ధర ఎడిపోతే, ఎంత పన్ను తగ్గిస్తావు" అని అడుగుతున్నారు. అది ప్రభుత్వం యొక్క నిర్ణయానికి వదిలి పెట్టాలి దీనికి ఒక ఫిక్సెడ్ స్కేలువేయటం అసంభవము ఎంత పంట నష్టమైతే ఎంత పన్ను తగ్గించాలి, అన్నది అప్పుడు ఉండే పరిస్థితులనుబట్టి మనం నిర్ణయిం చుకోవలసిన అవసరం ఉంది "ఎంత పంట పండితే ఎంత పన్ను వేయాలి, ఎంత ధర తగ్గితే ఎంత పన్ను తగ్గించాలి" అనేటటువంటివన్నీ, యీ చట్టంలో పెట్టి వ్యవహారంచేస్తే న్యాయంగా ఉండదుఅన్న సంగతి సభ్యులకు మనవిచేస్తున్నాను ఇంకొక సభ్యుడు చెబుతూ, కాటన్, గ్రౌండ్‌నట్ ఇన్‌డైరక్టు టాక్సెస్ ఇస్తున్నా యన్నారు సేల్స్‌టాక్స్ క్రింద అనేకము ఉన్నప్పుడు, ఇన్‌డైరక్టు టాక్స్ ఇవ్వనిది ఏమిటి? ఈ దేశంలో ప్రతి ఐటము ఇన్‌డైరక్టుటాక్స్ ఇస్తోంది షెడ్యూల్‌లో ఉన్నటువంటి టాక్సెస్ లైట్‌టాక్సెస్‌ను ఒక కలం గీటుతో సస్పెండ్‌చేసి, వాటిని అమల్లోకి రాకుండా చేసే అధికారము ప్రభుత్వము తీసు కొన్నది. కనుక యీ విషయమై ఎవరూ బాధపడి, అపోహపెట్టుకోవలసిన ఆవశ్యకతలేదు రెండు విషయాలు మధ్యన చర్చలో వచ్చాయి అప్పుడే వాటికి నేను సమాధానం చెప్పాను. "ఎన్‌టయిరులాండ్ అని అక్కడ ఉండటం వల్ల, యీ పన్ను మొత్తం భూమిమీద పడుతుందా" అని సభ్యులు అడిగితే, పడదని నేను సమాధానం చెప్పాను అది లీగల్ ఒపీనియన్ రెండవ విషయం – ఒక ప్రదేశంలో కాకుండా, పొలం గట్లమీద, చేల గట్లమీద వేసుకొనే పంటల మీద యీ పన్ను పడదని మనవిచేశాను ఒకే ప్రదేశంలో కాకుండా పొలం సరిహద్దు లలో, చేలచుట్టూ వేసుకొనే పంటలకు యీపన్ను వర్తించదని చెప్పాను అన్ని విషయాలు ఆలోచించి, సెలక్టుకమిటీవారి యొక్క సలహాలు తీసుకొని, ప్రభు త్వానికి కావలసిన ఆదాయాన్ని సంపాదించటంకోసం యీ పన్నులు వేయటం జరుగుతున్నది. మిత్రులు రామాచారిగారు హాస్యంలో చాలా గొప్పవారని ప్రసిద్ధి. వారు ఒక కథ చెప్పారు అల్లుడు అత్తవారింటికి వచ్చాడు. అత్తగారు అల్లుడిని 'నాస్తా చేస్తావా, చద్ది తింటావా, విందు చేస్తావా' అని అడిగింది. అని వారు చెప్పారు. వారు చెప్పిన ప్రిన్సిపుల్ నేను ఒప్పుకొన్నాను. ప్రభుత్వానికి నాస్తా, చద్ది, విందు తప్పకుండా కావాల్సించే ఇవన్నీ ఉంటేనే దేశాన్ని నడిపించటం సాధ్యం అవుతుంది. కాని ఒక సంగతిమాత్రం వారికి సవినయంగా మనవిచేస్తాను అత్తవారింటికి అల్లుడు "నాస్తా, చద్ది, విందు" కే రాడు, రాత్రి

భోజనం కూడ చేయటానికి వస్తాడని వారికి మనవిచేస్తూ, యీ బిల్లును సభ్యులు యిప్పుడే కన్సిడర్ చేసి పాస్ చేయాలని కోరుతున్నాను

*Mr Speaker* The question is

"That the Bill be circulated for the purpose of obtaining public opinion"

The motion was negatived

*Sri G Ganga Reddy* I demand a division, Sir

The House then divided

Ayes 40 Noes 84

The motion was negatived

*Mr. Speaker* The question is

"That the Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957 be taken into consideration at once"

The motion was adopted

*Clause* 2

*Mr. Speaker* The question is

"That Clause 2 stand part of the Bill"

The motion was adopted

Clause 2 was added to the Bill

*Clause* 3.

*Sri B Sriramamurthy* I beg to move

"In line 4 of clause 3, for the figures '1957', substitute the figures '1958'."

*Mr. Speaker:* Motion moved.

శ్రీ బి. శ్రీరామమూర్తి. అధ్యక్షా, నేను ఈ సవరణను ప్రతిపాదిస్తున్నాను. ఈ చట్టము తక్షణము అమలులోకి వస్తుందని ఉన్నది. అయితే యిందులో

కొన్ని రకాల యిబ్బందులు ఉన్నవి ప్రస్తుతము పంటలపరిస్థితి చూస్తే, వేర శనగ, పత్తివంటి పంటలు అన్ని యిదివరకే harvesting అంతా అయిపోయి యిళ్ళకు తీసుకొని పోవడముకూడ జరిగిపోయింది అందువల్ల యీ పంటలక యీ చట్టము వర్తించేటట్లుగా చేయాలని అంటే, ఏ ఏ పొలములో ఎంతెం పంట వేశారో తెలియడంకష్టం వాటికి సరియైన లెక్కలు లేవు తెలియవు కూడ వాటికి క్రమమైన లెక్కలు ప్రభుత్వము సేకరించడం సాధ్యంకాద మహానూలు అయిపోయిన పంటలకు యీ బిల్లు వర్తించే అవకాశము ఉన్నద అంటున్నారుగాని, లెక్కలు తెలియకుండా దేనిమీద, ఎంతఅని పన్ను విధించ బోతారు? గనుక ఈ సంవత్సరానికి యీ బిల్లు ఉపయోగపడదు రాబోయే 1958వ సంవత్సరమునకు దీనిని ఉపయోగించవచ్చు అంతేకాకుండా రైత తను భరించవలసిన పన్నుభారము ఏమాత్రము ఉన్నదో, అది యింతఅని తెలుసుకున్న తరువాత, అది సరియైనదా, దానిని మినహాయించడమా, అనేది తానే నిర్ణయించుకోవలసి ఉంటుంది అందువల్ల ప్రభుత్వము ఎలాంటి పన్ను వేయదలచుకున్నదో, అది తెలియకుండా తను గతసంవత్సరము వేసిన పన్నును ఆధారము చేసుకుని అదనపుపన్ను విధించినట్లైతే, రైతుకు గిట్టుబాటు లేక బాధపడేపరిస్థితి ఉంటుంది అందువల్ల యీ పన్ను విధించడము యిప్పటి నుంచి కాకుండా, 1958వ సంవత్సరమునుంచి అమలులోనికి వచ్చేటట్లు చేయాలి అందువల్ల యీ బిల్లు యీ సంవత్సరానికి పనికిరాదని నేను సవరణ రూపములో నా అభిప్రాయమును మంత్రిగారికి తెలియజేస్తున్నాను

* శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు: అధ్యక్షా, నేను యీ సవరణను బల పరుస్తున్నాను ఈ సవరణను గురించి దీర్ఘకాలము ఆలోచించినప్పటికినీ, అది యిప్పుడు అవసరమనే, నా అభిప్రాయము ఎందువల్లనంటే, ఈ బిల్లులో '1 st day of July 1957' అని పెట్టారు. అప్పటినుంచి ఇది అమలులో ఉంటుం దన్నట్లుగా పెట్టియున్నారు ఇప్పుడు యీ బిల్లును మనము ప్యాసుచేస్తే, దానికి గవర్నరుగారి assent వచ్చిన తరువాతనుంచి వసూలు ప్రారంభిస్తారు. ఈపన్ను దేనిమీద వసూలుచేస్తారు? పంటలు యింటికి వచ్చివేసినవి లెక్కలు ఉండవు. ఎంతవేసినదిన్నీ నిజస్థితి ఎవ్వరు కనిపెట్టలేరు. రైతులను అడిగితే చెప్పరుకూడ కరణము వ్రాసిన లెక్కలనుబట్టి చేయటానికి వీలు అవుతుంది అట్లా చేస్తే, వాళ్ళు ఉన్నవి, లేనివి వ్రాస్తే, పేద రైతులకు అన్యాయము జరుగుతుంది కాబట్టి ఈ పన్ను విధించడము సక్రమంగా న్యాయముగ జరగాలంటే దీనిని 1958 వ సంవత్సరము జులై నుంచి అయితే సరిపోతుంది. కాకపోతే యిప్పుడు

వేస్తామనుకునే పన్ను అంతాకూడ approximate గా వేయడమే జరుగుతుంది కాబట్టి ఇందులో న్యాయము జరగదు గనుక దీనికి proper time 1958 వ సంవత్సరము జులై నెల గనుక అప్పటినుంచి అమలులోనికి వచ్చేటట్లుగా యీ బిల్లును సవరించాలని కోరుతున్నాను మంత్రిగారు ఈ సవరణకు ఒప్పుకుంటారని ఆశిస్తున్నాము

శ్రీ కె వెంకటరావు ఈ సవరణను నేను అంగీకరించడము లేదండి

*Mr Speaker* The question is

"In line 4 of clause 3, for the figures '1957' substitute the figures '1958' "

The motion was negatived

( Pause )

*Sri B Sriramamurthy* I demand a division

*Sri K Brahmananda Reddy* As soon as the decision of the Speaker is announced it must be questioned

*Sri B. Sriramamurthy*: But it is a question of the Speaker hearing me

మీరు మీ decision announce చేయకముందు, నేను అంతకు ముందుగానే division కావాలని అడగడము జరిగింది. అది మీరు వినిపించుకో లేదు అందువల్ల దీనిమీద division జరిగేటట్లు ఆలోచించండి

*Sri V. B Raju*: The hon Member has not caught the eye of the Speaker (Laughter).

*Mr Speaker*. I am sorry the hon Member has not caught the eye of the Speaker. Therefore let us go to the next subject.

*Sri B Sriramamurthy*: I beg to move

"In lines 4 and 5 of clause 3, delete the words 'and for each subsequent year' "

*Mr. Speaker*: Motion moved

*శ్రీ బి. శ్రీరామమూర్తి. అధ్యక్షా, నేను యీ సవరణను move చేసే ముందుగానే ఒక్క విషయము మనవి చేయదలచుకున్నాను. దానిని అధ్యక్షుల

వారు దయయుంచి ఆలోచిస్తారని ఆశిస్తున్నాను ఇప్పుడు నేను move చేసిన సవరణ ఓటుకు పెట్టవలసి ఉంటుందని అంటున్నాను తరువాత అధ్యక్షులవారి చెవిగానీ, కన్నుగాని నేను ఆకర్షించలేక పోతానేమోనని ముందుగానే యీ విషయమును గురించి మనవి చేస్తున్నాను. ఈ విషయము అధ్యక్షులవారు గమనించాలని అంటున్నాను

ప్రస్తుతము ఈ చట్టము చేయడము ఎంతమాత్రము ప్రయోజనము కన్పించదు ఈ సంవత్సరముయొక్క పంట అంతా ఇళ్ళకు పోనే పోయింది ఇక దీనికి లెక్కలు కట్టటానికి సాధ్యము కాదు అందువల్ల దీనిని వచ్చే సంవత్సరమునుంచి అమలు జరపడము సమంజసము ఇదే నా సవరణయొక్క ముఖ్యోద్దేశ్యము నేను ఇందాక move చేసిన సవరణ వీగిపోయింది అయితే వచ్చే సంవత్సరమునుంచి దీన్ని వర్తించేటట్లు చేయాలని చెప్పితే, అట్లు కాదని, ఈ సంవత్సరమునకు కూడ ఇది ఉపయోగించి అమలు జరపాలనే ప్రయత్నము ప్రభుత్వము చేస్తున్నది అలాంటి ప్రయత్నము సరియైనదికాదు న్యాయము కాదు సరియైన లెక్కలు తెలియటానికి వీలుండదు గనుక, ప్రభుత్వము యీ పన్ను approximate గా గత పంటలను బట్టి వేయడము న్యాయముకాదు ఈ సంవత్సరము వర్షాలుకూడ లేవు. పంటలు పండలేదు అందువల్ల గత సంవత్సరపు లెక్కలు ప్రకారము చేస్తే, రైతులను అన్యాయము చేసినట్లు అవుతోంది ఇక పోతే వచ్చే సంవత్సరపు పంటలు ఏవిధముగ ఉండబోతాయో, వర్షాలు ఉంటాయో, ఉండవో ఎవరు చెప్పగలరు ? రైతుకు గిట్టుబాటు అవుతుందో, కాదో, అప్పటిమాట ఆలోచించవచ్చు కాబట్టి దీన్ని ఈ సంవత్సరమునకు ఆపివేస్తే మంచిది వచ్చే సంవత్సరము అమలు జరిగేటట్లు చేయడానికైనా ఈ బిల్లు జీవితము పొడిగించాలా, లేదా అనేది ఉత్తరోత్తరా చర్చించిన వారు నిర్ణయించవచ్చు అంతేకాని ఒకేసారి తొందరపడి యీ చట్టము ప్యాసుచేస్తే, యావజ్జీవితము కూడ రైతులను బాధించడమే అవుతుంది అందువల్ల "for each subsequent year" అనేది delete చేయాలని కోరుతున్నాను.

*శ్రీ కె. వెంకటరావు ఇది అనవసరమైన సవరణ ఒకసారి పన్ను వేసిన తరువాత, మనము ఇక దానిని తీసివేసినదాకా, దానిని గురించి చూచుకోవలసిందేనని నేను ఇదివరకే మనవి చేశాను—కనుక ఇది అనవసరము.

*Mr Speaker* The question is

"In lines 4 and 5 of Clause 3, delete the words 'and for each subsequent year' "

The motion was negatived

*Sri B Sriramamurthy* I demand a division Sir

The House then divided

Ayes 36 Noes 74

The motion was negatived

*Mr Speaker* It is not necessary to move the next amendment (No 7), because it is the same as the previous amendment Sri P Venkateswarlu may move his amendment

*Sri Pillalamarri Venkateswarlu* I beg to move

"Add the following at the end of Explanation I of clause 3—

'but do not include a person or persons whose land revenue assessment does not exceed Rs 10 without taking into consideration the water and other cess payable by him' "

*Mr Speaker* Motion moved

*శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు అధ్యక్షా, ఈ సవరణను నేను ప్రతిపాదిస్తున్నాను ఇది మా party principle అని కాకుండా, మన కళా వెంకటరావు గారి యొక్క సూత్రము కూడ యిందులో ఉన్నది Land Revenue Surcharge Bill విషయంలో పదిరూపాయలవరకు exemption యిచ్చారు అదేవిధముగ దీనివిషయములో కూడ exemption ఇస్తే బాగా ఉంటుందనే ఉద్దేశ్యముతోనే దీనిని ప్రత్యేకంగా ఇక్కడ పొందుపరచడము జరిగింది పది రూపాయలు శిస్తు కట్టే రైతులకు వచ్చే ఆదాయము చాలా తక్కువగా ఉంటుంది అసలు ఇప్పటికే వారిమీద ఈ పన్ను ఆపన్ను అని చాలా ఎక్కువగానే పన్ను పడింది, ఎట్లాగో కష్టపడి కట్టుకుంటున్నారు అందువల్ల కనీసము యీ పన్ను అయినా వారిమీద లేకుండాచేస్తే బాగా ఉంటుంది ఆ ఉద్దేశ్యముతోనే యీ సవరణ తెచ్చాము. ఇప్పుడు మేము చెప్పేది ఏ 25 రూపాయలో, ఏ యాభై రూపాయలో ఉంటే కళా వెంకటరావుగారు ఏట్లాగు అంగీకరించర నేసంగతి తెలుసు. అందువల్ల వారు చెప్పినసూత్రన్నే వారిముందు పెట్టినట్లయితే, దానిని కొంత సానుభూతితో

పరిశీలించి అంగీకరిస్తారని ఆశిస్తూ యీ సవరణ తెచ్చాము కాబట్టి మంత్రి గారు యీ సవరణను అంగీకరించమని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు అక్కడ ఉన్న అవసరమునుబట్టి, పదిరూపాయలు అనేది ఈ సర్ ఛార్జి బిల్లులో పెట్టినమాట నిజమే Wet assessment బిల్లులో పెట్టదలచుకోలేదు సరికదా, ఇక్కడకూడ పెట్టదలచుకోలేదు

*Mr Speaker* The question is

"Add the following at the end of Explanation I of clause 3 'but do not include a person or persons whose land revenue assessment does not exceed Rs 10 without taking into consideration the water and other cess payable by him' "

The motion was negatived

*Sri Vavilala Gopalakrishniah* Sir, I beg to move that

In line 5 of clause 3, after the word 'persons' insert the words 'who owns a land of two acres of dry land and one acre of wet land'

*Mr. Speaker* · Motion moved.

* శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య · అధ్యక్షా, రెండు ఎకరాల మెట్ట, ఒక ఎకరం మాగాణి వుండేవాళ్ళను దీంట్లోనుంచి మినహాయించాలనే అభిప్రాయంతో పెట్టాను మంత్రిగారు ఒప్పుకుంటారో లేదో చెబితే సరిపోతుంది, దానికి నేను పెద్ద ఉపన్యాసం యివ్వడం అనవసరం

శ్రీ కె వెంకటరావు ఇందాక వారు రూపాయలు చెప్పారు, వీరు ఎకరాలు చెప్పారు రెండింటికీ తేడాలేదు ఒప్పుకోడానికి వీలులేదు

*Mr. Speaker* · The question is .

In line 5 of Clause 3, after the word 'person' insert the words "who owns a land of two acres of dry land and one acre of wet land".

The motion was negatived.

*Sri Vavilala Gopalakrishniah* I demand a division, Sir

The House then divided

Ayes 33, — Noes 72

The motion was negatived

*Sri Vavilala Gopalakrishniah* Sir I beg to move

Add the following at the end of line 8 of clause 3

"This assessment is liable to be varied, according to the fluctuation of market rates for two years"

*Mr Speaker* Amendment moved

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య రెండుసంవత్సరాల మార్కెటురేటును బట్టి అప్పుడప్పుడు యిది మారుతూ వుండాలనే సవరణను ఉపపాదిస్తున్నాను. పసుపు, మిర్చి, మొదలైనవాటికి మార్కెటు ధరలలో విపర్యాసాలు వస్తూ వుంటాయి నేడున్నధరలను బట్టి పన్ను వేస్తున్నారు, పసుపుధర ఒకప్పుడు 500 రూపాయ లుండేది ఇప్పుడు 50 రూపాయలకు దిగింది మిర్చి 350 రూపాయలు, 400 రూపాయలు కూడా ఒకప్పుడు అమ్మినది ఇప్పుడు 100 రూపాయలు కూడా ధర రావడంలేదు పొగాకుకు ఒకసారి highest rate వచ్చింది తరువాత తగ్గింది. అరటి పండ్లకు ఒకసారి ఎగుమతి వచ్చేసరికి ధరవస్తుంది, మళ్ళా తగ్గిపోతుంది కొబ్బరికి ఎగుమతి వచ్చినపుడు ధర పెరిగి, లేనపుడు తరుగుతుంది వేరుశనగ ఎన్నో కొంపలార్పినది రైతాంగానికి పంట నష్టంలో వచ్చే remission పూర్తిగా రాదు. వేరుశనగ ఎగుమతిని నిషేధించడం వల్ల ధర తగ్గిపోయింది. అట్లాగే మిరపకాయలను యితర దేశాలకు ఎగుమతి చేయడానికి ఆంధ్ర రాష్ట్రంలోని రైతులకు అవకాశం లేకుండా పోయింది మద్రాసు రాష్ట్రంలో ప్రభుత్వానికి దగ్గరగా వున్న వ్యాపారస్థులు మాత్రమే permit లు సంపాదించుకోడం సాధ్యమైనది ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత అది అసాధ్యమైనందువల్ల మిర్చి దెబ్బతిన్నది వర్జీనియా పొగాకుకు 3 సంవత్సరముల క్రిందట ధర తగ్గి రైతులస్థితి ఒకేసారి కుప్పకూలినట్లు పడిపోయింది. కేంద్ర ప్రభుత్వం పన్ను వేయగా, ఆ పొగాకును మట్టిపాలు చేద్దామంటే డబ్బిచ్చుకోవాలి, ఉంచుకున్నా డబ్బు యిచ్చుకోవాలి. కాని దానివల్ల వచ్చే డబ్బు యేమీ లేదు. ఈ ధరల fluctuations ను జ్ఞాపకం వుంచుకోవాలి రైతులు చెరకును ఎంత పండించినా Factory యజమానులు, "మా యిష్టంవచ్చిన ధర, మా యిష్టం వచ్చినప్పుడు యిస్తాం" అంటారు. చెరకు ధరలపై Control,

factory యజమానుల చేతులలో వుంది అందుచేత ధరలలో fluctuation వస్తున్నది తరువాత citrus fruit వుంది ఈ మధ్య కరాచీనుండి ఎగుమతి లేనందువల్ల ధరలు తగ్గిపోతున్నాయి "Citrus fruit వల్ల ఒక ఎకరానికి చాలా ఆదాయం వస్తుందికదా, మేము వేసేది రెండురూపాయలే కదా" అని చెప్పవచ్చు కాని ఏపంటవేసినా ధరలు రావడంలేదన్నది ప్రధానం తరువాత ప్రత్తివిషయంలో ధరలు తగ్గుతూవుంటే సామాన్యరైతులు యేమీ చేయలేకుండా వున్నారు Long staple cotton చాలా కొద్దిప్రాంతంలో వుంది Short staple వస్తుంది దానిని ఉపయోగపరచడం లేదు Long staple వేయించుకోడానికి జరిగిన ప్రయత్నాలు జయప్రదంగా లేవు ఈ వరుసన ఏది చూచుకున్నా ప్రతిపంటకు కావలసిన సౌకర్యాలు లేవు పండినపంటలు అమ్ముడుపోవడానికి కావలసిన సౌకర్యాలు లేవు ధరల fluctuations వల్ల రైతు దెబ్బతింటున్నాడు కాబట్టి మారేధరల ననుసరించే యీ పన్నురేట్లు కూడా వుండాలని నా ప్రతిపాదన

* శ్రీ కె. వెంకటరావు · అధ్యక్షా, ఇప్పుడు ఊరికే చెప్పాలని చెప్పిన విషయంతప్ప, దీనినంతటినీ దృష్టిలో పెట్టుకొనే special clause పెట్టారు పెద్ద variations వచ్చే పరిస్థితులు ఏర్పడితే పన్నే తీసివేయడానికి మేము సిద్ధంగావుంటే, దీనిని దృష్టిలో పెట్టుకోవాలనే సవరణ ఎందుకు ? మేము పెట్టినదే చాలా liberal గా వుంది వారి సవరణవల్ల ఎవరికీ ఉపయోగం లేదు కాబట్టి దానిని accept చేయడంలేదు

*Mr Speaker* The question is

Add the following at the end of line 8 of Clause 3

"This assessment is liable to be varied according to the fluctuation of market rates for two years"

The motion was negatived.

*Sri B Sriramamurthy* Sir I beg to move.

"Delete Explanation II of Clause 3"

*Mr. Speaker* · Amendment moved.

*శ్రీ బి. శ్రీరామమూర్తి : అధ్యక్షా, ఈ సవరణను ప్రతిపాదించడంలో నా ఉద్దేశ్యం ఒకటే షెడ్యూలులో 10 రకాలైనపంటలు చూపించారు ఆ పటి

తరహాలైన పంటలపై వాణిజ్య పన్ను పడుతుంది ఈ పది పంటలలో ఏ రెండు మూడు నాలుగు పంటలో కలిపివేయడానికి సర్వసామాన్యంగా అవకాశంలేదు ఎందుకంటే పసుగుడు వుంది కొబ్బరి వుంది చెరకుంది పసుపుంది అరటి పండ్లున్నాయి ఈ పంటలు రెండుకు మించి 3, 4 పంటలు కలిపివేయడానికి అవకాశం సామాన్యంగా లేదు అందుచేత యీ రకమైన explanation అనవసరమని భావిస్తున్నాను పోతే ప్రభుత్వం schedule ను సవరించడానికి, కొత్త items ను add చేయడానికి అవకాశం యింకో clause లో వేసుకున్నారు కాబట్టి బహుశః యీ explanation అవసరమై వుంటుంది అందుచేత యిటువైన సవరించడమా, మానడమా, అనే ప్రశ్న వచ్చినప్పుడు మాత్రమే దీనికి సంబంధం వుంటుంది ఈ schedule లో చూపించే 10 రకాలైన పంటలలో ఏ రెండు మూడు కలిపి వరుసగా వేయడానికి అవకాశం లేదు కాబట్టి యీ రకమైన explanation అనసరం అందులో దేనికి హెచ్చు రేటు వుంటే ఆ రేటు ప్రకారం వేయాలా, మానాలా అనే ప్రశ్న ఉత్పన్నంకాదని నేను వారికి మనవి చేస్తూ సవరణను ప్రతిపాదిస్తున్నాను

శ్రీ కె వెంకటరావు వారొక అపోహలో వున్నారు. ఏవీ కలపటానికి వీలులేదని వారు చెప్పారు కలిపేవి వున్నాయి కనుకనే ఇది పెట్టవలసి వచ్చింది Casuarina ను Cotton ను కలుపలేము కాని Cottonను Groundnut ను కలుపవచ్చును అట్లా కలిపేవి వున్నాయి కనుకనే ఈ క్లాజు వుండే అవకాశం ఏర్పడింది అందుచేతనే ఇది పెట్టటం జరిగింది.

*Mr. Speaker* The question is

'Delete Explanation II of clause 3'.

The motion was negatived.

*Sri A Venkatarama Raju*. I beg to move ·

In Explanation II of clause 3, for the last four lines substitute the following

"the crop which occupies more area should alone be taken into account and the entire land shall be levied the tax at the rates specified to it"

*Mr Speaker*. Motion moved

*Sri A. Venkatrama Raju* I beg to move.

In Explanation II of clause 3, for the last four lines substitute the following

"the crop which lives longer alone should be taken into account and the entire land shall be levied the tax at the rates specified to it"

*Mr. Speaker* Motion moved

*Sri G. Ganga Reddi* I beg to move

In Explanation II of clause 3, after the words "special assessment shall be levied" insert the following

"at the average rate applicable in respect of such crops so raised"

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* I beg to move

In Explanation II of clause 3, after the words "levied at the" insert the following

"rate of 3/4th of the"

*Mr Speaker.* Motion moved.

*Sri G. Ganga Reddi* I beg to move

In Explanation II of clause 3, for the words "higher or highest" substitute the words "lower or lowest"

*Mr Speaker* Motion moved.

*Sri M Nagi Reddi.* I beg to move

In Explanation II of clause 3, for the words "higher or highest of the rates applicable to any one of the crops so specified and raised on the land as if such crop alone was raised on the entire land" substitute the following.

"At half of the rates applicable to each of the crops so specified and raised on that land."

*Mr. Speaker:* Motion moved.

*శ్రీ ఎ వెంకటరామరాజు (రాజోలు - జనరల్) అధ్యక్షా, 10 నుండి 15 వరకు ఉన్న సవరణలో ఎక్కువ ప్రాంతములలో ఎక్కువకాలం ఉండే పంటల వివరములు ఉన్నవి కొబ్బరితోటలలో అరటికాని పసుపుకాని వేసే ఆల వాటు ఉంది మంత్రిగారు తెల్పిన రేట్లలో పసుపుకు, అరటికి ఎక్కువరేటు ఉంది కొబ్బరికి తక్కువరేటు ఉంది కాని ప్రధానమైన పంటగా ఉంటుంది పసుపు గాని అరటిగాని తక్కువగా ఉంటాయి ఈ explanatoin లో ఈ సవరణ లేకపోయినట్లయితే ఎక్కువకాలం ఉండే కొబ్బరికి తాత్కాలికమైన పసుపు అరటి రేట్లుకట్టే ప్రమాదం వున్నది మన రాష్ట్రములో కొబ్బరితోటలు వేల సంఖ్యలోనే వున్నాయి ఆ ప్రాంతంనుండి వచ్చిన శ్రీ కళావెంకటరావు గారికి ఆ సంగతి తెలుసు అందువల్ల ఆ ప్రమాదం లేకుండా వుండటానికి ఈ సవరణలు అంగీకరించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను ఈ సవరణను అంగీకరిస్తే రైతులకు ఏరకమైన ఇబ్బంది వుండదని మనవి చేస్తున్నాను

*శ్రీయం. నాగిరెడ్డి అధ్యక్షా, ఈ సవరణలను ప్రతిపాదించటములో న్యాయం వుంది కనుక దీనిని అంగీకరించమని మంత్రిగారిని మీ ద్వారా కోరుతున్నాను. జొన్న, ప్రత్తి కలుపుతే రెండుచాళ్ళు జొన్న, ఒకచాలు ప్రత్తి కలుపుతారు. కొఱ్ఱ ప్రత్తికూడా అదేవిధంగా కలుపుతారు,

Mixed crops వేసేటప్పుడు సాధారణంగా ఎక్కువ భాగం ఆహార పదార్థాలకు సంబంధించి వుంటుంది. పైరు చచ్చిపోతుందేమోనని, లేక వల్చ పడుతుందేమోనని ఈ విధంగా commercial crops ను ఆహారపదార్థములతో కలిపి వేస్తారు అనుభవమువున్న శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు నిజమేనని శ్రీ కళా వెంకట్రావుగారికి చెబుతున్నట్లున్నారు

శ్రీ కె. వెంకటరావు నాతో ఏమీ చెప్పటంలేదండి.

శ్రీ యం. నాగిరెడ్డి దీనిని దృష్టిలో పెట్టుకుంటే ఆహార పదార్థాలతో కలిపివేసినవాటిపై పన్ను తీసివేయవలసిన అవసరం ఉందని మనవి చేస్తున్నాను రెండు కమ్మర్షియల్ క్రాప్స్ వేస్తే వాటికిగల lowest rate ను తీసుకోవాలి Higher, or highest అని పెట్టారుకాని, lowest తీసికోవాలి. మొదట ఆహార పదార్థము వేసినా, వేసవికాలంలో, బావిక్రింద నీరు పెట్టి రెండవ పంటగా commercial crop రైతు వేసుకొంటాడు దానికి అదనపు ఖర్చు అవుతుంది ఎరువులు వేయాలి. మోటతో నీళ్ళు తోడి పెట్టాలి కాని ప్రధానమైన

పంటగా ఆహారపదార్థమే వుంటుంది ఏదో శిస్తుల కైనా వస్తుందనే ఉద్దేశ్యంతో వేసవికాలంలో ఏదో 2nd crop గా వేస్తాడు. రాత్రింబగళ్ళు కష్టపడి, మోటతోలి శ్రమించి పనిచేస్తాడు అది 2nd crop అయినా పన్ను వేస్తామని చెప్పటం సరైనదికాదు ఒక సంవత్సరంలో రెండు పంటలు వేస్తే highest rate వేస్తామని బిల్లులో వుంది మొదటి పంట వేరు శనగ వేసి, రెండో పంట జావులక్రింద మిర్చి వేస్తే, ప్రధానమైన పంట అయిన వేరుశనగను లెక్కలోనికి తీసికొనకుండా, ఏది ఎక్కువ అయితే ఆ పంట రేటు చెప్పటం న్యాయం కాదు. రెండవ దానికి తక్కువ yield వస్తుంది కనుక దానిని దృష్టిలో పెట్టుకొని తక్కువ దానికి వేసేయుటను మంత్రిగారు అంగీకరించాలి. ఆహారపదార్థాలలో కలిపివేసే వాటిని మూడు, నాలుగు చాళ్ళకు ఒక సారి వేస్తూవుంటారు ఆ విషయమును అనేకసార్లు మంత్రిగారి దృష్టికి తీసుకు వచ్చాను అందుచేత ఆహార పంటలలో కలిపిన mixed పంటలు పూర్తిగా తీసివేయాలనే మా సవరణను అంగీకరించాలని లేకపోతే రైతులు నష్టపడుతారని చెబుతూ సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ పి. నరసింగరావు అధ్యక్షా! రెండు కమర్షియల్ క్రాప్స్ ఒకే భూమిలో వేస్తే highest rate వేస్తామని ఈ explanation లో వుంది Citrus fruit వేసిన వెంటనే ఫలితాలకు రావు—అలా రాకపోయినా ప్రతి సంవత్సరము 2-0-0 వేస్తామని ఇందులో వుంది Citrus fruit వేసిన భూమిలో వున్న ఖాళీ స్థలములో ground-nut కాని, chillies కాని వేయటం జరుగుతుంది Chillies కు రు 3-0-0 ground-nut కు రు 1-0-0 వేయవలసి ఉంటుంది దానిలో highest rate వేస్తారు అంటే ఒక విధమైన అన్యాయం జరుగుతుంది Citrus trees నుంచి ఫలితం వెంటనే రాదు కనుక ఆ loss ను ఏదోవిధంగా 'రికూప్' చేసుకోటానికే వేరుసెనగగాని, మిర్చిగాని వేయటంజరుగుతుంది అలా ఏ ¼ area లోనో పెట్టటం జరుగుతుంది. అలా ¼ area లో పెట్టిన దానివల్ల highest అని విధించటం సమంజసమైన విషయం కాదు అందువల్ల 'highest' కు బదులు 'lowest' అని వుంటే Citrus కు రు 2-0-0 వుంటే అప్పుడు మిర్చికి రు.3 0-0 చెల్లించుకునే పరిస్థితి తప్పుతుంది. కాబట్టి higher or highest కు బదులు lower or lowest అనే సవరణను మంత్రిగారు అంగీకరించాలని నేను కోరుతున్నాను

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు - జనరల్) Schedule II లో ఒకేభూమిలో రెండు పైరులు వేసినట్లయితే ఎక్కువ పంట వస్తున్నట్లుగా పరిగణించి, ఎక్కువవన్ను వసూలు చేయాలంటున్నారు. ఇది ఎక్కడి న్యాయ సూత్రమో నాకు అర్థకావడం కష్టంగా ఉన్నది ఇంతకుముందు నరసింగరావు

గారు చెప్పినట్లుగా పండ్లతోటలలో యితరమైన పైరు ఏదైనా కలిపివేసుకొనే ఆచారం ఉన్నది ప్రత్తి, వేరుసెనగ కలిపి వేస్తారు నిమ్మతోటలో మిరప, వేరుశనగవంటివి వేసే ఆచారం ఉన్నది అట్లాంటప్పుడు వేయబడిన పంటలకు గల highest rate తీసుకుంటామనడం న్యాయం అనిపించు కోదు అల్లాకాకుండా, proportionate గా తీసుకుంటే చక్కగా ఉంటుంది అట్లా కానప్పుడు highest rate లో ¾ వంతు rate తీసుకోవడం మంచిది దానికి యిదివరకు ఒకసారి ఒప్పుకున్నారు కొట్టు, ప్రత్తి వేసినట్లయితే 75 నయాపైసలు తీసుకొంటామన్నారు అట్లాగే దీనిలో కూడా highest rate లో 75% తీసుకునే సూత్రాన్ని ప్రవేశపెడితే బాగుంటుంది కాని, 2 పైరులు కలిపివేసిన నేరానికి మొదటి highest rate తీసుకుంటామనేది అంత న్యాయం అనిపించుకోదు ఇప్పుడు నరసింగరావుగారు చెప్పిన యిబ్బందులు తోటలు వేసిన భూములలోనే ఎక్కువగా వస్తాయి అవి 4, 5 ఏండ్లయితేనేగాని ఫలసాయం యివ్వవు అటువంటితోటలలో మిరపగాని, వేరుశనగకాని వేసుకునే అవకాశం ఉన్నది వేరుశనగ అయితే ఒక రూపాయే అనుకోండి కాని మిరప వేస్తే పన్నులు పెరిగిపోయే అవకాశం ఉన్నది అందుచేత, highest rate లో ¾ వంతు అనేదిగాని, కనీసం highest నుంచి lowest rate అనే amendment ను అంగీకరించాలని మంత్రిగారిని కోరుతున్నాను దానిని అంగీకరించడంలో వారికి ఏమైనా యిబ్బందివుంటే కనీసం నా amendment నైనా అంగీకరించాలని కోరుతున్నాను

* శ్రీ బి శ్రీరామమూర్తి . Average rate అనేదానిని గురించి కొంచెం explain చేస్తాను

నరసింగరావుగారి సవరణ ప్రకారం lowest rate ప్రకారం శిస్తువిధింపు అనేది ఉన్నది అది ప్రభుత్వానికి ఆమోదయోగ్యం కాకపోతే, నరసింహారావు గారు తెచ్చిన highest rate లో ¾ వంతు అనేదైనా అంగీకరించి ప్రభుత్వంవారు లెక్కకట్టి విధించండి.

అదికూడా ప్రభుత్వానికి అంగీకారయోగ్యం కానప్పుడు ఇంకొకసవరణ ఉన్నది అది, "ఆ భూమిలో మొత్తం ఎన్నిరకాల పంటలు వేస్తారో, ఆ పంటలన్నింటిమీద ప్రభుత్వం పన్ను విధించడానికి అవకాశం ఉన్న రేటులను తీసికొని average కట్టి average rate మాత్రమే విధించాలి ఈ మూడురకాల సవరణలలో ఏ ఒక్కటైనా అంగీకరించవచ్చు. మొదటినుంచీ ఈ మూడుపన్నుల

బిల్లులు ప్రభుత్వానికి మూడుకన్నులుగా ఉన్నాయి ఈ మూడవకన్ను కూడా పూర్తిగా తెరిస్తే లోకం భగ్గుమంటుంది కాబట్టి కనీసం ఏఒక్క సవరణనయినా సరే అంగీకరించాలని కోరుతున్నాను

* శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, మనకు ఎవ్వరిప్రశంస అక్కరలేదు లోకందగ్గరకు అసలు వెళ్ళవలసిన పనిలేదు ఒక్క సభ్యులప్రశంస వుంటే చాలు అందులో శ్రీరామమూర్తిగారి ప్రశంస తీసుకోడానికి ప్రయత్నం చేస్తున్నాను కాని, సాధ్యపడడంలేదు ఈ బిల్లును దీర్ఘంగా ఆలోచించే, రెండు, మూడుపంటలకు కలిపివేస్తే concession యివ్వటం జరిగింది ఇక మిగిలిన చోట్లకూడా concession యివ్వడం మొదలుపెడితే దీనికి అంతంఉండదు ఇందాకటినుంచీ village officers మీద ఉపన్యాసాలు చెప్పినవిషయం యిది వరకు నిజమైనా, అబద్ధమైనా యిది exemption తో కూడి పెట్టినట్లయితే మరీ ఎక్కువ అవుతుంది అందువల్ల ఆ రకంగా కలపడానికి వీలులేదు ఇంతకు fundamental ఏమిటి ? రెండు ఆహారపంటలు వేసినట్లైతే, ఏమీ యివ్వక్కర లేదు Food crop తో ఇంకొకటి ఏదైనా కలిపివేసి లాభం తీసుకొంటున్నట్లయితే దానిమైన పన్ను వేస్తున్నాము కాని విడిగా తీసుకోవలసిన ఆవశ్యకతలేదు దీనివల్ల ప్రత్యేకమైన కష్టంరాదు శ్రీ పి నరసింగరావుగారు చెప్పినట్లుగా ఎక్కడో నిమ్మ తోటలలో వేసుకొన్న దానికి highest-rate ను charge చేస్తారా అంటే—లేదని నేను యిదివరకే చెప్పినాను It must be a contiguous area మామూలుగా, 10 అడుగుల లోపల వరుసగా నిమ్మ చెట్లు ఎలా పాతుకుంటారో అలా పాతినట్లయితేనే పన్ను యివ్వవలసి వస్తుంది కాని యిది disperse చేసి ఏదోరకంగా లాభం తీసుకుందామని వేసుకొన్న వారికి యివ్వడానికి వీలులేదు

అల్లూరి వెంకటరామరాజుగారు అనుభవపూర్వకమైన ఒక విషయం చెప్పారు కొబ్బరితోటలలో పసుపుచెట్లు వేసుకుంటారు కొబ్బరితోటలున్నచోట సాధారణంగా ఒక నుయ్యి ఉంటుంది, ఆ నుయ్యివద్ద 5, 6 చెట్లు వేసుకుంటారు ఆ రకంగా వేసినట్లయితే పన్ను యివ్వనక్కరలేదు. ఆ రకంగా పసుపు వేసుకొన్నా యివ్వనక్కరలేదు కాని తోటమధ్య కొబ్బరిచెట్లుగాని, పసుపుగాని వేసుకుంటే ఎక్కువ ఆదాయం తీసుకొంటున్నాడు కనుక 5 రూ॥ లకు బదులు రెండురూపాయలు యిచ్చుకోవడం తటస్థిస్తోంది. పూర్తిగా అరటితోట వేసుకుంటే, 5 రూ॥ లు యిచ్చుకోవాలి, ప్రత్యేకంగా కొబ్బరితోట వేస్తే 8 రూ॥ లు యిచ్చుకోవాలి, కాని రెండూ కలిపినచోట 5 రూ॥ లు యివ్వాలి.

ఇది యింకొక ఆదాయం పూర్తిగా యిస్తోంది వారి నియోజకవర్గంలోని కొన్ని గ్రామాలలో ఎక్కువ ఆదాయం తీసుకోవడానికి యిదే ప్రత్యేక కారణం 5రూ॥లు తీసుకోవడంవల్ల రైతుకుగాని, మరి యితరు లెవ్వరికీగాని ఏ విధమైన నష్టమూ కలుగదు

*Mr Speaker*: The question is

"In Explanation II of clause 3, for the last four lines substitute the following

'the crop which occupies more area should alone be taken into account and the entire land shall be levied the tax at the rates specified to it' "

The motion was negatived

*Mr Speaker* The question is.

"In Explanation II of clause 3, for the last four lines substitute the following

'the crop which lives longer alone should be taken into account and the entire land shall be levied the tax at the rates specified to it' "

The motion was negatived.

*Mr Speaker* The question is.

"In Explanation II of clause 3, after the words 'special assessment shall be levied' insert the following:

'at the average rate applicable in respect of such crops so raised'."

The motion was negatived

*Mr Speaker*: The question is:

"In Explanation II of clause 3, after the words 'levied at the' insert the following:

'rate of 3/4th of the'."

The motion was negatived.

*Mr Speaker* The question is

"In Explanation II of clause 3, for the words 'higher o highest', substitute the words 'lower or lowest' "

The motion was negatived

*Sri G Ganga Reddi* I demand a devision, Sir

The House then divided

Ayes 39, — Noes 76

The motion was negatived

*Mr. Speaker* The question is

"In Explanation II of clause 3, for the words 'higher or highest of the rates applicable to any one of the crops so specified and raised on the land as if such crop alone was raised on the entire land', substitute the following

'at half of the rates applicable to each of the crops so specified and raised on that land' "

The motion was negatived

*Sri K.L. Narasimha Rao*: I beg to move

"Delete Explanation III of clause 3 "

*Mr. Speaker* Motion moved

*శ్రీ కె. యల్ నరసింహారావు అధ్యక్షా, Schedule లో ఉన్న cropsను యితరపంటలు కలిపివేసినట్లయితే, ఏమిచేయాలి అనేది దీంట్లో చూపించబడింది అట్లాంటప్పుడు "On the same land the special assessment shall be levied" అనేది దీంట్లో ఉన్నది. Schedule కు వున్న Explanation II లో schedule లో ఉన్న పంటలను, schedule లో లేని crops ను కలిపి సేద్యం చేసినట్లయితే concession యివ్వాలనేది ఇక్కడ ఉన్నది నా అభిప్రాయం ప్రకారం యిది Explanation II ను contradict చేస్తున్నది. Explanation II ఉన్నప్పుడు Explanation III ని ఉంచవలసిన అవసరం ఉంటుందని నేను అనుకోవడంలేదు. దీనిని మనం అంగీకరించినట్లయితే Explanation II ద్వారా కల్గించే సౌకర్యానికి దెబ్బతీస్తుంది. అందుచేత దీనిని delete చేయవలసినదని కోరుతున్నాను.

శ్రీ కె వెంకటరావు: అధ్యక్షా, ఇది ఒప్పుకొంటే యీ చట్టము యొక్క లక్ష్యమే పోతుంది కనుక దానిని నేను అంగీకరించటము లేదు.

*Mr Speaker* The question is

"Delete Explanation III of clause 3 "

The motion was negatived

*Sri A Yeruku Naidu (Salur-general)* I beg to move

" For Explanation III in clause 3, substitute the following

'When the crop is not one specified in the schedule, no special assessment shall be levied in respect of other mixed crops specified in the schedule' "

*Mr Speaker* Motion moved

*శ్రీ ఎ ఎరుకనాయుడు అధ్యక్షా, శ్రీకాకుళం జిల్లా ప్రాంతంలో మెట్టభూముల్లో ఎకరానికి ఐదారు చొప్పున నారింజచెట్లు వేయటం జరుగుతుంది పల్లం భూమిలో ఐదారు కొబ్బరిచెట్లుకూడ ఉంటాయి అక్కడ పల్లం భూమిలో వరిపంట పండిస్తారు మెట్ట భూమిలో జొన్న, కొఱ్ఱ, గంటి పండిస్తారు ఆ భూమిలో కొంతభాగం ఫుడ్ గ్రెయిన్స్ పండిస్తూ, మరికొంత భాగంలో కొబ్బరి, నిమ్మ, నారింజ పంటలు వేసుకొంటారు అటువంటప్పుడు షెడ్యూల్‌లో ఉన్న పంటలపై వేయు పన్నును, యీ మొత్తం భూమిమీద వసూలు చేయటం న్యాయంకాదు కాబట్టి, నా సవరణను అంగీకరించాలని కోరుతున్నాను

*Sri B Sriramamurthy* I beg to move

"For Explanation III in clause 3, substitute the following .

'Where any crop specified in the schedule is raised as a fixed crop together with a primary crop not specified in the schedule the proportionate area of such crop shall be taken into consideration for the purpose of levying special assessment' "

*Mr Speaker* Motion moved

*శ్రీ బి. శ్రీరామమూర్తి. అధ్యక్షా, ఇంతకు పూర్వం దీనిని గురించి కొంత చర్చ జరిగింది ఈ షెడ్యూల్‌లో ఉన్న ఏ రెండు పంటలు అయినా కలిపి పండించి నట్లయితే, ఏమిచేయాలన్న దానిపైన ఇదివరకు చర్చ జరిగింది. ఇప్పుడు షెడ్యూల్‌లో లేనటువంటి క్రాప్, షెడ్యూల్‌లో ఉన్నటువంటి

క్రాప్ కలిపివేస్తే, ఏ రకంగా పన్ను వసూలుచేయాలి అన్న సమస్య ప్రస్తుతం మనముందు ఉన్నది షెడ్యూల్‌లో లేని క్రాప్‌తో కలిపి, ఒక కమర్షియల్ క్రాప్ వేసినపుడు, ప్రభుత్వం రెండు రకాలుగా పన్ను వసూలుచేయటానికి అవకాశం ఉంది. షెడ్యూల్‌లో లేని క్రాప్స్‌మీద ఏ విధంగా అయితే పన్ను లేదో, అదేవిధంగా యీ కమర్షియల్ క్రాప్స్‌మీద కూడ పన్ను వేయటానికి వీలులేదు అది ఒక రకమైన పద్ధతి లేదా కమర్షియల్ క్రాప్ వేస్తున్న భాగానికి మాత్రమే పన్ను వేయాలి అంతేగాని, మొత్తం భూమిమీద పన్ను వేయకూడదు షెడ్యూల్‌లో లేని పంట ఉన్న భాగమునకు కాకుండా, కేవలం కమర్షియల్ క్రాప్ పండించే భాగానికి మాత్రమే పన్ను వసూలుచేయాలి ఇది రెండవ పద్ధతి ఈ రెండు పద్ధతులలో ఏదో ఒకటి ప్రభుత్వం చేస్తే, మాకు అంగీకారయోగ్యంగా ఉంటుంది అందువల్ల ప్రభుత్వం దీనిని ఆలోచించాలని కోరుతున్నాను

*Sri B Sankariah* I beg to move

"In Explanation III of clause 3, for the words 'the special assessment shall be levied as if the crop so specified alone was raised on the entire land' substitute the words 'the special assessment shall not be levied if the area of the crop so specified alone do not exceed one-half of the total crops raised on the entire land' "

*Mr Speaker*. Motion moved.

*శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం-జనరల్) అధ్యక్షా, ఈ సవరణను నేను ప్రతిపాదిస్తున్నాను ఇంతకుముందు మంత్రిగారు మాట్లాడుతూ, ఒక భూమిలో మెయిన్ క్రాప్ వేసుకొని మధ్యలో పసుపు పంట వేసుకుంటే, అటువంటివాటిపైన ఇది పడదని చెప్పారు. ఆ పంట సగం ఏరియాకంటె ఎక్కువ ఉన్నప్పుడు పన్ను వేయాలిగాని, అంతకు తక్కువ ఏరియాలో యీ కమర్షియల్ క్రాప్స్ వేసుకొంటే, దానిమీద పన్ను వేయటం న్యాయంకాదని చెప్పాము ఒక మెయిన్ క్రాప్ ఉండి, మధ్యలో అక్కడక్కడ ఇతర పంటలు వేసినపుడు, ఆ పంటలమీద కూడ పన్ను వేయటం న్యాయం కాదని ఒక ప్రక్క ఒప్పుకొంటూ, ఎక్స్‌ప్లనేషన్ 3 లో అటువంటిదేమీ లేకుండా మొత్తం భూమి మీద పన్ను వేస్తామని చెప్పారు. అది న్యాయమైన పద్ధతికాదు. అందులో వేసిన మెయిన్ క్రాప్‌ను లెక్కలోకి తీసుకోవాలి. సగంకంటె ఎక్కువ భూమిలో వేసిన క్రాప్‌నే లెక్కలోకి తీసుకొని పన్ను వేయాలి. మంత్రిగారు

చెబుతున్న విషయాలు ఒక విధంగా ఉంటున్నాయి. వారు బిల్లులో పెట్టిన విషయాలు వేరొక విధంగా ఉంటున్నాయి ఈ బిల్లులో ఉన్నదాని ప్రకారం చూస్తే, రైతులమీద ఎక్కువ పన్నుభారం పడేదానికి అవకాశము ఉన్నది ఒక ఎకరం, అర ఎకరం ఉన్నవారు, ఆ భూమిలో కొంత భాగం ఇతర పంటలు వేసుకొంటారు ఎక్కువ భాగం ఒక మెయిన్ క్రాప్ వేసుకొంటారు. ఆ విధంగా ఇతర పంటలు వేసుకొని జీవించేవారు ఉన్నారు కాబట్టి, మొత్తం భూమిమీద పన్ను వేయకుండా, ఆ పంట సగం ఏరియాకు మించి వేసినపుడు, దానిమీద పన్ను వేయాలి అది మంత్రిగారు చెప్పిన ప్రకారంకూడ న్యాయమైనది ఒక ఎకరంలో మెయిన్ క్రాప్ వేసుకొని మధ్యలో 10 మిరపచెట్లు వేసుకొంటే, వాటినికూడ లెక్కకట్టి, పన్ను వేయటంలో చాలా ప్రమాదం ఉన్నది కొబ్బరిమీద పన్ను లేకుండా ఎగ్జంప్ట్ చేశామని చెప్పారు. కుడిచేతితో ఇచ్చి ఎడమచేతితో తీసుకొన్నట్లుగా ప్రభుత్వం వ్యవహరిస్తున్నది కాబట్టి నా సవరణను ఒప్పుకోవలసిందిగా కోరుతున్నాను

*Sri M Nagi Reddi* I beg to move

"In Explanation III of clause 3, for the words 'as if the crop so specified alone was raised on the entire land' substitute the words 'at half the rate of the crop so specified on the entire land' "

*Mr Speaker* . Motion moved

* శ్రీ యం నాగిరెడ్డి అధ్యక్షా, మొత్తం భూమిలో సగానికి తక్కువగా పంట వేసుకొంటే, దానిమీద పన్ను తీసివేయమని ఇంతకుముందు ఒక సవరణ తీసుకువచ్చామనుకోండి సాధారణంగా ఆహారపదార్థములు పండించుకొనే ఏరియా ఎక్కువగా ఉంటుంది. ఆ ఏరియాలో మూడవవంతో, నాలుగవ వంతో మాత్రమే ఇతర పంటలు వేసుకోవటం జరుగుతుంది ఒక ఎకరంలో 75 సెంట్లు ఆహారపదార్థాలు వేసి, 25 సెంట్లు మాత్రమే, వ్యాపారపంటలు వేస్తే, మొత్తం ఆ ఎకరంమీద వ్యాపారపంట వేసినట్లుగా లెక్క తీసుకొని, పన్ను వేయాలని, మన కళా వెంకటరావుగారు పెట్టిన బిల్లులో ఉన్నది అది చాలా అన్యాయమని చెబుతున్నాను నాలుగవవంతు వేసినదానిని ఎకరం వేసినట్లు లెక్క వేసుకోమనటం, వెయ్యనిదానిని వేసినట్లుగా లెక్క కట్టుకోమనటం, ఆవిధంగా లెక్కకట్టి పన్ను వేయటం చాలా అన్యాయమని చెబుతున్నాను ఎకరంలో 25 సెంట్లు వేస్తే, 50 సెంట్లు వేసినారనుకొని, సగంమీద మాత్రమే పన్ను వేయాలి. మేము చాలా లిబరల్‌గా యీ సవరణ పెట్టాము. కనీసం దీనినైనా అంగీకరించమని కోరుతున్నాను.

*Sri G Yellamanda Reddi (Kanigiri)* I beg to move

"In Explanation III of clause 3, for the words 'alone was raised on the entire land' substitute the words 'was raised on 1/3rd of the same land' "

*Mr Speaker* Motion moved

*శ్రీ జి ఎల్లమందారెడ్డి అధ్యక్షా, మన షెడ్యూల్‌లో ఉండేటటువంటి క్రాప్ మొత్తం భూమిలో మూడవవంతు వేస్తే, అప్పుడు దానిపైన పన్ను వేయాలని నా ఉద్దేశము కొఱ్ఱపంటకు 75 నయాపైసలు వేస్తున్నారు, కొఱ్ఱ ప త్తి పంటలు కలిపివేసినపుడు, కొఱ్ఱపంట మొత్తం భూమిలో శే వంతుకన్నా తక్కువ ఉండదు ఈ కొఱ్రపంటను షెడ్యూల్‌లో ఉన్న ఏ పంటప్రక్కనో వేసిన, మొత్తం భూమిమీద పన్ను వేయాలన్న సిద్ధాంతం చాలాతప్పు సిద్ధాంతము రైతు అక్కడఉండే ఆచారాలుబట్టి, విధానాలుబట్టి, ఎగ్రికల్చరల్ టాక్‌టిక్స్‌బట్టి, పంటలు వేసుకొంటూ ఉంటాడు ఆ విధానాలను ఎడ్వాంటేజ్‌గా ప్రభుత్వం తీసుకొని పన్ను విధించటం సరైంది కాదు "రైతు కొంత భూమిలో ప్రత్తివేశాడు, మిరప వేశాడు. కాబట్టి మొత్తంభూమిమీద ఆ వ్యాపారపంటలపై పన్ను వసూలుచేస్తామని" అంటే, అది వ్యవసాయ అభివృద్ధికే దెబ్బతగులుతుందని చెబుతున్నాను మనము ఎట్లాగు మొత్తము భూమిలో వేసే షెడ్యూల్‌లో గల పంటలమీద పన్ను వేస్తున్నాము ఎక్కడో మిక్సెడ్ పంట వేసినపుడు, మూడోవంతు ఏరియాలో వ్యాపారపంట వేసినపుడు మాత్రమే, పన్ను విధించాలి. సాధారణంగా షెడ్యూల్‌లో ఉన్న క్రాప్ వేసే ఏరియా మూడోవంతుకంటే జాస్తిగా ఉండదు. కాబట్టి మొత్తం భూమిలో మూడో వంతు షెడ్యూల్‌లో ఉన్న క్రాప్ వేస్తే పన్ను విధించాలి.

*Sri P. Narasinga Rao*: I beg to move

"In Explanation III of clause 3, after the words 'raised on' insert the words 'the 3/4th area of'."

*Mr. Speaker*: Motion moved

* శ్రీ పి. నరసింగరావు: అధ్యక్షా, షెడ్యూల్‌లో ఉన్న క్రాప్, ఇంకా వేరే క్రాప్ కలిపి వేసినట్లయితే, యీ షెడ్యూల్‌లో ఉన్న మొత్తం క్రాప్‌మీద పన్ను విధిస్తామని అన్నారు. షెడ్యూల్ క్రింద రెండవ ఎక్స్‌ప్లెనేషన్‌లో కేవలం

ప్రత్తి, కొర్రకు మాత్రమే ఎగ్జంప్షన్ ఇవ్వటం జరిగింది ఈవిధంగా ఉన్న మిక్సెడ్ క్రాప్స్—వేరుశనగ, కంది, ప్రత్తి, కంది,—మీదకూడ ¾ వంతు ఏరియామీదనే పన్ను వేసి, నాలుగోవంతు ఏరియాను మినహాయిస్తారని అనుకొన్నాను కాని అది మామూలు ధోరణిలోనే మాముందు పెట్టటం జరిగింది సాధారణంగా, కొర్ర, ప్రత్తి మా ప్రాంతంలో ఎక్కడా వేస్తున్నట్లు కనబడదు అవి వేరే ప్రాంతాల్లో ఎక్కడైనా వేస్తూండవచ్చు కాని యీ ప్రాంతంలో సహజంగా వేరుశనగ, కంది, ప్రత్తి, కంది వేయడం జరుగుతుంది మూడుసాళ్ళు ప్రత్తివేస్తే, ఒకసాలు కందివేయటం, మూడుసాళ్ళు వేరుసెనగవేస్తే, ఒకసాలు కందివేయటం యీవిధంగా మూడుబైనాలుగోవంతు ఏరియాలో కమ్మర్షియల్ క్రాప్ వేయటం, నాలుగోవంతు ఏరియాలో కంది వగైరా ఇతర పంటలు వేయటం జరుగుతుంది మెయిన్‌క్రాప్ చెడిపోతే, కనీసం యీ సబ్సిడరీ క్రాప్ వల్లనైనా, తమ ఖర్చులకు, వ్యవసాయ ఖర్చులకు సరిపోగల ఆదాయం వస్తుందనే ఉద్దేశంతో ఆవిధంగా వేయటం జరుగుతుంది కాబట్టి, మూడుబైనాలుగువంతు ఏరియా అని ఉన్న నా అమెండ్‌మెంట్‌ను మంత్రిగారు ఇప్పటికైనా ఆలోచించి అంగీకరించాలని నేను కోరుతున్నాను. ఈ సవరణ ఆమోదించటమువల్ల వచ్చేప్రమాదం లేదు ఈ సవరణవల్ల వచ్చేనష్టంలేదని అనుకొంటున్నాను

శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్షా, నా నియోజక వర్గంలో వేరుశనగ—కొఱ్ఱ, వేరుశనగ—నువ్వులు కలిపివేస్తారు ఏ మొక్క ఏదో చెప్పలేనంతగా ఒకదానితో యింకొకటి కలిసి వుంటాయి నువ్వు వాణిజ్యపంట అయినప్పటికి ఏ కారణం చేతనో దానిని వాణిజ్యపంటగా చూపించడం జరగలేదు కాబట్టి నువ్వు—వేఱుశనగ వేసినచోట నాల్గవవంతు మాఫీ యివ్వవలెనని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు అక్కౌంట్సు రీత్యాగాని ఎస్టిమేట్ చేయడం రీత్యాగాని దీనిని అమలుచేయడం అసాధ్యమైన విషయం కనుక ఈ సవరణను అంగీకరించడానికి వీలులేదు ప్రత్తి—కొఱ్ఱ పంటలను సులభముగ గుర్తించవచ్చు వేరుశనగకు అదనంగా వేసే పన్ను రూపాయి మాత్రమే. ఈక్విటీకి ఏవిధంగాను యిబ్బంది రాదు కనుక మినహాయింపు యివ్వనక్కరలేదు.

***Mr. Speaker*: I shall now put amendments (Nos. 18, 19, 20, 22, 24 and 25) to the vote of the House.**

**The question is :**

"For Explanation III in clause 3, substitute the following

'When the crop is not one specified in the schedule, no special assessment shall be levied in respect of other mixed crops specified in the schedule' "

The motion was negatived

*Mr Speaker* The question is

"For Explanation III in clause 3, substitute the following

'Where any crop specified in the schedule is raised as a fixed crop together with a primary crop not specified in the schedule, the proportionate area of such crop shall be taken into consideration for the purpose of levying special assessment' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In Explanation III of clause 3, for the words 'the special assessment shall be levied as if the crop so specified alone was raised on the entire land' substitute the words 'the special assessment shall not be levied if the area of the crop so specified alone do not exceed one-half of the total crops raised on the entire land' "

The motion was negatived

*Mr. Speaker* The question is

"In Explanation III of clause 3, for the words 'as if the crop so specified alone was raised on the entire land' substitute the words 'at half-the rate of the crop so specified on the entire land'."

The motion was negatived

*Mr. Speaker*: The question is

"In Explanation III of clause 3, for the words 'alone was raised on the entire land' substitute the words 'was raised on 1/3rd of the same land'."

The motion was negatived

*Mr. Speaker*. The question is.

"In Explanation III of clause 3, after the words 'raised on', insert the words 'the 3/4th area of'."

The motion was negatived.

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 39, — Noes 83,

The motion was negatived

*Sri B Sreeramamurthy* Mr Speaker, Sir, I beg to move
"Delete Explanation IV of clause 3"

*Mr Speaker* Motion moved

శ్రీ బి శ్రీరామమూర్తి ఇదివరకు మా సవరణలు వేటికీ మంత్రిగారు సమాధానం చెప్పని రోజులలో మాటలకన్న మూకిభావానికే బలము హెచ్చుగా ఉన్నట్లు కనపడింది అందుచేత దీనిపై నేను మాట్లాడను వారు ఏమంటారో చూస్తాను

*శ్రీ పి. సత్యనారాయణ ఎక్స్ప్లనేషన్ నెం 2, 3 ఉన్నవి కనుక నాల్గవ ఎక్స్ప్లనేషన్ అవసరం లేదనుకుంటాను "in succession" అంటే ఒకే సంవత్సరంలో అదే పంట రెండో పర్యాయము వేస్తే అనే అర్థము వస్తుంది ఒకే సంవత్సరంలో అదే పంట రెండవ పర్యాయం వేసినపుడు తక్కువ ఆదాయము వస్తుందనేది అందరికి తెలిసినదే అలాంటప్పుడు "highest rate" వేయడము న్యాయం కాదని అది తీసివేయాలని చెబుతున్నాను. ఎప్పుడు ఏ పంట రైతు వేశాడు—అనే దానిని గురించి లెక్కలు తీయడానికి గ్రామోద్యోగులకు అదనంగా యిచ్చేదానికన్న యీ అదనపు పన్ను మాఫీ చేసినందువల్ల ప్రభుత్వానికి హెచ్చు నష్టమురాదు కాబట్టి దీనిని మినహాయించవలెనని కోరుతున్నాను అయితే సక్సెసివ్ క్రాప్ విషయంలో "highest rate" వేయకుండా "lowest rate" వేసినట్లయితే రాజీ పడడానికి అభ్యంతరం లేదు

శ్రీ కె వెంకటరావు. నే నంగీకరించడం లేదు,

*Mr. Speaker* The question is.
"'Delete Explanation IV of clause 3'"

The motion was negatived.

*Sri B Sreeramamurthy*: Mr. Speaker, Sir, I beg to move
"For Explanation IV of clause 3, substitute the following

'Where two or more crops specified in the schedule are raised in succession on the land in the same year, the special assessment shall be levied at the average rate applicable in respect of such crop so raised' "

*Mr Speaker* Motion moved

శ్రీ బి. శ్రీరామమూర్తి రెండుమూడు పంటలు "in succession" వేసి నట్లయితే "highest rate" విధించడానికి పూనుకుంటున్నారు దీనివల్ల రైతుకు ఎంతో నష్టం కలుగుతుంది. ఒకసారి పంటపోతే ఆ నష్టాన్ని కూడదీసుకోడానికి తిరిగి ఆ పంట పెట్టవలసి వస్తుంది అందువల్ల "highest rate" యివ్వడం సాధ్యం కాదు కాబట్టి సగటు రేటు విధించడం న్యాయం ఎక్కడో ఒకచోట బేరం తెగనిద్దాము కనీసం దీనినైన అంగీకరించమని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! దానిలో ఒక difficulty ఉన్నది ఒకటే పంట tobacco వేస్తే రు 5 లు యివ్వవలసి వస్తుంది మొట్టమొదట cotton వేస్తే రు 1 యివ్వవలసి వస్తుంది దాని ఫలితంగా, రెండూ వేయుటవల్ల తక్కువ పన్ను యిచ్చే పరిస్థితి ఏర్పడుతుంది కనుక, యీ సవరణను అంగీకరించుటకు వీలులేదు

*Sri P Narasing Rao* Mr Speaker, Sir, I beg to move

"In Explanation IV of clause 3, for the words 'higher or highest' substitute the words 'lower or lowest' "

*Mr. Speaker*. Motion moved

*శ్రీ పి. నరసింగరావు అధ్యక్షా! 'Higher or highest' కు బదులు 'lower or lowest' అని నేను సవరణ యిచ్చాను సహజంగా వేరుశనగ మొదట వేయటం జరుగుతుంది. తరువాత మిరప వేస్తారు అయితే మొట్టమొదట వేరుశనగ వేసి తరువాత మిరపవేస్తే, మిరప పంట తక్కువ వస్తుంది అసలు భూములు ఎక్కువ సారవంతమైనవి కావు కనుక, వేరుశనగ వేసినతరువాత భూసారం తగ్గిపోతుంది Subsidiary crops గా మిరప వేయుట జరుగుతుంది మిరప పంటమీద యీ షెడ్యూలు ప్రకారం రు. 3 లు వేస్తారు వేరుశనగకు 1 రూపాయి వేశారు కాని, వేరుశనగ తరువాత మిర్చివేస్తేనే రూపాయకు బదులు మూడు రూపాయలు చెల్లించవలసి యుంటుంది. కాబట్టి సీజనులో

మొదట వేసినపంటమీద మాత్రం, పన్ను వేసేటట్లయితే దీనిని ఉపసంహరించు కుంటాను దానికి మంత్రిగారు అంగీకరించకపోతే యీ సవరణను press చేస్తాను

శ్రీ కె వెంకటరావు అది అంగీకరించుటకు వీలులేదు ఒక్కొక్కప్పుడు మొట్టమొదటి పంట, ముఖ్యమైనదవుతుంది, ఒక్కొక్కప్పుడు రెండవ పంట ముఖ్యమయినది, ఎక్కువ ఆదాయం వచ్చేది అవుతుంది. అందువల్ల యీ రెండింటి కలయిక వీలైన విషయంకాదు ఏమయినప్పటికి రెండు పంటలు వేయుటవల్ల, మొత్తం మీద ఎక్కువ ఆదాయమే వస్తుంది కనుక, అందులో కొంచెం ప్రభుత్వమునకు యిచ్చుకొనుటలో నష్టం ఉండదు

*Sri M Nagi Reddi* Mr Speaker, Sir, I beg to move

"In Explanation IV of clause 3, for the words 'at the higher or highest of the rates applicable to any one of the crops so raised' substitute the words 'at the rate applicable on the first crop so raised' "

*Mr Speaker* Motion moved.

* శ్రీ యమ్. నాగిరెడ్డి అధ్యక్షా, మొట్టమొదటి పంటమీద పన్ను వేయమంటే, మంత్రిగారు చెప్పినది—ఒక్కొక్కప్పుడు రెండవపంట costliest కావచ్చును కాబట్టి, ఆ ప్రకారం మొదటిపంటనే లెక్కలోకి తీసుకొనుటకు వీలులేదంటున్నారు కాని వాస్తవంగాచూస్తే మొదటవేసినదే బాగా పండు తుంది రెండవపంట yield తగ్గుతుంది భూమికి బలం ఎక్కువపెట్టాలి మోట వేసి నీరుపెట్టాలి ఈ విధంగా రెండవపంటకు ఎక్కువకష్టం చేయాలి మొట్ట మొదటి పంటే ప్రధానమైనది. దానికి highest tax అయితే highest rate ప్రకారమే యిస్తాడు Lowest అయితే lowest యిస్తాడు అది న్యాయమైన పద్ధతి కాని దీనికి మంత్రిగారు అంగీకరించుటలేదు వ్యవసాయదారుల దృష్టిలో చూస్తే మేము చెప్పినదే వాస్తవమైనది. మొట్టమొదటి పంటే ప్రధానమైనది. దానినే లెక్కలోకి తీసుకొనవలెనని, పన్ను వేయవలెనని మనవి చేస్తున్నాను

శ్రీ కె వెంకటరావు . అధ్యక్షా, నా అనుభవం, దానికి వ్యతిరేకం రెండవపంటే ఖరీదైనవి వేస్తారు. అసలు, సామెతకూడ ఉన్నది. "ఉత్తరచూచి

ఎత్తర గంప" అన్నారు అంటే మంచిపంట (రెండవది) వేసుకొనటంకోసం అది అంటారు తరువాత వేసేపంటలో ఎక్కువలాభం వస్తుంది కనుక నేను ఆ సవరణను అంగీకరించటం లేదు

*Mr Speaker* The question is

"For Explanation IV of clause 3, substitute the following

'Where two or more crops specified in the schedule are raised in succession on the land in the same year, the special assessment shall be levied at the average rate applicable in respect of such crop so raised' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In Explanation IV of clause 3, for the words 'higher or highest' substitute the words 'lower or lowest' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In Explanation IV of clause 3, for the words 'at the higher or highest of the rates applicable to any one of the crops so raised', substitute the words 'at the rate applicable on the first crop so raised' "

The motion was negatived

*Mr Speaker* Now, amendments Nos 30, 31 and 32 will be taken together

*Sri G. Yellamanda Reddy* Mr Speaker, Sir, I beg to move.

"Add the following as Explanation V in clause 3

'Explanation V. The enhancement of this special assessment shall not be taken into consideration for the purpose of calculating other cesses on land'."

*Mr Speaker:* Motion moved.

*శ్రీ జి. యల్లమందారెడ్డి · అధ్యక్షా, ఈ explanation 5, చేర్చమని కోరుతున్నాను. అధికంగా వేసే పన్నుమీద సెస్సులు ఉండకూడదని నా మనవి.

ఇందులో ఒక తమాషా ఉన్నది ప త్తికి ఒకరూపాయి పన్ను అని, వర్జీనియా పొగాకుకు మూడు రూపాయల పన్ను అని, యీ విధంగా వేసుకుంటూ పోతాము కాని automatic గా ఆ పన్నుల పెరుగుదలతోబాటు సెస్సులు కూడా పెరుగుతాయి ఇవన్నీ కలిపి హనుమంతుని తోకలాగ పెరుగుతూ పోతాయి ఈ భారమంతా రైతులమీద పడుతుంది ఈ సెస్సులు తక్కువ ఏమీలేవు రూపాయికు అ 5 లు కంటే తక్కువ లేకుండా యున్నవి మొత్తం 5 రూపాయలు పన్ను వుంటే, సెస్సులతో కలిపి రు 6-9-0 లు అవుతుంది కొత్తపన్నుల ద్వారా ఎకరానికి మూడు, నాలుగు రూపాయలు పెరిగే అవకాశం యున్నది Objects and reasons లో పన్నులు పెంచదలచి నట్లు చెప్పినారు కాబట్టి, పన్నులు మాత్రమే పెంచి, వాటికి యీ సెస్సులను వేయకుండా చేయాలి కనీసం ఈ కమర్షియల్ క్రాప్సువరకైనా, యీసెస్సులు మినహాయింపు చేయాలని, అది న్యాయమైనదని మనవి చేస్తున్నాను

*Sri M Nagi Reddi* Mr Speaker, Sir, I beg to move

"Add the following as Explanation V in clause—

'Explanation V—Land cess and education tax shall not be levied on the special assessment payable under this section "

*Mr Speaker* Motion moved

శ్రీ యమ్. నాగిరెడ్డి అధ్యక్షా, నిన్న సర్ ఛార్జి బిల్ పాస్ చేసినప్పుడు, సర్ ఛార్జిమీద సెస్సులు పడకూడదని ఒక క్లాజు పెట్టాము కాని కమర్షియల్ క్రాప్స్‌మీద వేసే పన్నులకు సెస్సులు ఉండాలనటం సమంజసం కాదు. ఇది చాలా అన్యాయం ఒక రైతుకు 50ఎకరాలుంటే, 25 ఎకరాలలో కమర్షియల్ క్రాప్స్ వేసినప్పుడు స్పెషల్ అసెస్‌మెంట్ 50 రూపాయలు కట్టితే, దాని మీద రు. 16 లు సెస్సులు పడతాయి ఇదివరకే శిస్తు standardisation మీద సెస్సులు పెరిగాయి ఇప్పుడు మళ్ళీ వాణిజ్య పంటలమీద వేసే పన్నులమీద కూడా సెస్సులు యివ్వాలంటున్నారు. ఇదంతా మోయరాని భారం అవు తున్నది. నిన్న సర్‌చార్జికి రెమిషన్ యిచ్చినట్లుగా, యీ వాణిజ్య పంటలమీద వేసే పన్నులకు సెస్సులు మినహాయించాలని యీ సవరణలు అంగీకరించాలని కోరుతున్నాను.

**Sri Vavilala Gopalakrishnayya*: Mr Speaker, Sir, I beg to move .

'Add the following as Explanation V in clause 3.

'Explanation V This assessment will not be taken for calculation of any cess from the persons owning five acres of dry and two and half acres of wet land' "

*Mr Speaker* Motion moved

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య  అధ్యక్షా, ఇవన్నీ దాదాపు money crops ఇప్పటికే వీటిమీద చాలా పన్నులు ఉన్నాయి  Money crops అయినందువల్ల కేంద్రప్రభుత్వంకూడ పన్నులు వేస్తున్నది  ఉదాహరణకు పొగాకు మీద కేంద్ర ప్రభుత్వం పన్ను ఉన్నది  వేరుశనగమీద పన్ను ఉన్నది  ఈ రెండూ మన రాష్ట్రములో పెద్ద పంటలు  సెంట్రల్ గవర్నమెంటు కొంత, రాష్ట్ర ప్రభుత్వము కొంత, పన్నులు వేస్తున్నాయి, డబ్బు ఉన్నవాడే పన్నులు చెల్లిస్తాడని కాదు  అవి చిన్నవానిమీద కూడ పడుతున్నాయి, ఆ విషయం మరువకూడదు. అందువల్ల 'many taxes on money crops' అనే విధంగా కాకుండా, ప్రభుత్వం ఆలోచించి, చిన్నవారికి భారంలేకుండా చేయవలెనని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు  అధ్యక్షా, ఇందులో కొన్ని తోకలుకూడ వచ్చాయి  అసలు సర్చార్జి ఒక తోక  అందువల్ల సర్చార్జిమీద సెస్సులు వేయలేదు  అసలు, పన్నులకు సెస్సులు తోకలాంటివి "సెస్సులు వదలిపెడతావా" అని బ్రహ్మానందరెడ్డిగారిని అడిగాను  వదలటానికి వీల్లేదని వారు అంటున్నారు  సెస్సులు పెట్టటం వల్ల ఉపయోగం ఉన్నది  ఈ సెస్సుల ద్వారా వసూలుచేసే ధనం, హాస్పటల్స్ పెట్టటానికి, రోడ్లు వేయటానికి ఉపయోగిస్తారు గనుక, వాటిని తీసివేసే అవకాశంలేదని మనవిచేస్తున్నాను

*Mr. Speaker* I will now put amendments Nos 30, 31 and 23 to the vote of the House.

The question is :

"Add the following as Explanation V in clause 3.

'Explanation V.—The enhancement of this special assessment shall not be taken into consideration for the purpose of calculating other cesses on land' "

The motion was negatived.

*Sri G Yellamanda Reddi* Sir I demand a division, Sir

The House then divided

Ayes 39, — Noes 80

The motion was negatived

*Mr Speaker* The question is

"Add the following as Explanation V in clause—

'Explanation V —Land cess and education tax shall not be levied on the special assessment payable under this section' "

The motion was negatived

*Mr Speaker* The question is

"Add the following as Explanation V in clause 3

'Explanation V — This assessment will not be taken for calculation of any cess from the persons owning five acres of dry and two and half acres of wet land' "

The motion was negatived

*Mr Speaker* · The question is :

"That clause 3 stand part of the Bill"

The motion was adopted

Clause 3 was added to the Bill

*Clause* 4

*Sri P Satyanarayana* Sir, I beg to move ·

"Delete sub-clause (1) of clause 4."

*Mr Speaker* Motion moved.

* శ్రీ పి. సత్యనారాయణ : అధ్యక్షా, సీజనల్ కండిషన్స్‌వల్ల, నేచురల్ కెలామిటీస్ వల్ల పంటలకు నష్టంకలిగినపుడు, ఆఫీసర్‌గారు ఇండివిడ్యుయల్స్ నుంచి అప్లికేషన్స్ తీసుకొని రెమిషన్ ఇవ్వాలని ఇందులో ఉంది. సాధారణంగా సీజనల్ కండిషన్స్ వల్ల ఏదైనా కెలామిటీ వస్తే, ఆ ప్రాంతం అంతటికి వస్తుంది. అందుచేత ఆ ప్రాంతం అంతటికి అలాంటి ప్రమాదం వచ్చినప్పుడు, చిన్న కారు

రైతాంగము ఒక్కొక్కరు ఒక్కొక్క పిటీషన్ పెట్టుకోవటం సాధారణంగా జరుగదు సన్నకారు రైతును అలాంటి ఇబ్బందులలో పెట్టకుండా యీ క్లాజు తీసివేస్తే సరిపోతుందని అనుకొంటాను

"ఏదైనా ఒక ఏరియాలో అలాంటి ఇబ్బందులు వచ్చినప్పుడు, ప్రభుత్వం ఆ ఏరియాను రెమిషన్ ఇవ్వవలసిన ఏరియాగా డిక్లేర్ చేసి, అక్కడ రెమిషన్ సదుపాయాలు కలుగజేయవచ్చును" అని రెండవ క్లాజులో ఉంది అందుచేత మొదటిక్లాజులోఆఫీసర్సుకు ప్రత్యేకంగా అధికారాలు ఇవ్వటం, ప్రతి రైతు అప్లికేషన్ పెట్టుకోవాలని చెప్పటం అనవసరము కాబట్టి మొదటి క్లాజుఅవసరం లేదని చెబుతున్నాను.

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఒకే ఊరులో రెండు మూడు రకాల పరిస్థితులు ఉండవచ్చు అటువంటప్పుడు క్లాజు ఒకటి ఆపరేట్ అవుతుంది అటువంటి పరిస్థితులు మొత్తంగా దేశంలో వస్తే క్లాజు రెండు, ఆపరేట్ అవుతుంది మొత్తం ఆ ప్రాంతం అంతా బాగానే ఉండి, ఏ ఒకరికో పంటలు పండకపోతే, ఆ ఒకరికి అపకారం జరగకుండా చేయటానికి యీక్లాజు ఒకటి, పెట్టాము అసలు యీ క్లాజు పెట్టినందుకు సభ్యులు హర్షించాలి ఈ క్లాజు వల్ల ఎవరికి నష్టం వచ్చేదిలేదు అందువల్ల వారి సవరణను అంగీకరించటానికి వీలులేదని మనవి చేస్తున్నాను.

*Mr Speaker* The question is

"Delete sub-clause (1) of Clause 4"

The motion was negatived

*Sri B Sreeramamurti.* I beg to move.

"In line 2 of sub-clause (1) of Clause 4 after the words 'natural calamities' insert the words 'or when the yield of the crops falls below 30% of the average obtaining for the previous three years'."

*Mr. Speaker* · Motion moved.

* శ్రీ బి. శ్రీరామమూర్తి · అధ్యక్షా, ఏ రకమైన కన్సిడరేషన్సులేకుండా నిర్నిబంధంగా, అనుకొన్న ప్రకారం ప్రభుత్వం యీ ఎడిషనల్ ఎసెస్‌మెంట్ వేయటం సరైన విషయంకాదని మనవిచేస్తున్నాను. పంటలుపోయే పరిస్థితి

ఏర్పడినపుడు, ప్రభుత్వం రైతులకు రెమిషన్ ఇవ్వటానికి సిద్ధపడుతుందని యీ బిల్లులో ఒక క్లాజు ఉన్నది అయితే నేచురల్ కెలామిటీస్‌వల్ల పోయినటువంటి పంటలకు మాత్రమే రెమిషన్ ఇస్తామని ఇందులో స్పష్టంగా ఉన్నది నేచురల్ కెలామిటీస్‌వల్ల ఎంత పంట పోయినట్లయితే రెమిషన్ వస్తుంది, అన్న విషయం ఇందులో స్పష్టంగా లేదు నూటికి 35 వంతుల పంట పోయిన రోజున ప్రభుత్వం తప్పనిసరిగా శిస్తు రిమిషన్ ఇచ్చితీరాలని స్పష్టంగా ఒక నిర్ణయం చేస్తే తప్ప యీ క్లాజుకు సరైన అర్థంరాదు కేవలం నేచురల్ కెలామిటీస్ వల్ల పంటలు చెడితేనే కాదు, ఇంకా ఏ ఇతర కారణాలవల్లనైనా, నీరు సరైన కాలంలో అందని కారణంవల్లనైనా పంటలు చెడిపోతే ప్రభుత్వం తప్పనిసరిగా రెమిషన్ ఇవ్వాలని కోరుతున్నాను ప్రభుత్వం యీ సవరణ అంగీకరించకపోతే రైతులకు సరైన న్యాయం కలుగదని మనవిచేస్తున్నాను నిజానికి మేము పెట్టిన ఏ సవరణ ప్రభుత్వం అంగీకరించలేదు కనీసం యీ సవరణఅయినా అంగీకరించాలని కోరుతున్నాను ఆ విధంగా ప్రభుత్వం అంగీకరించకపోతే మాకు సవరణల మీదనే నమ్మకం పోతుంది శాసనసభలో ఉన్నటువంటి సంఖ్యాబలాన్ని సవరించవలసినటువంటి అవశ్యకత మాత్రమే మా ఎదుట క్వశ్చన్ మార్క్ క్రింద ఉంటుందని తెలియజేస్తూ, యీ సవరణను మంత్రిగారు ఆమోదించాలని కోరుతున్నాను.

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, నాకు ఏ క్వశ్చన్‌మార్కు కనుపించటం లేదు నాకు ఎదుటిపక్షంలో కూడ స్నేహితులే కనుపిస్తున్నారు రెమిషన్ రూల్సుకూడ యాక్టులో పెట్టవలసిన పరిస్థితిలేదు ఏవైనా ఉధృతమైన కష్టాలు ఏర్పడినపుడు రైతులకు శిస్తు రెమిషన్ ఇవ్వటానికి తగు చర్యలు తీసుకొనే అవకాశం ప్రభుత్వానికి ఉన్నది గనుక, నేను యీ అమెండ్‌మెంట్‌ను వ్యతిరేకిస్తున్నాను

*Mr. Speaker*: The question is

"In line 2 of sub-clause (1) of clause 4, after the words 'natural calamities', insert the words 'or when the yield of the crops falls below 30% of the average obtaining for the previous three years'."

The motion was negatived

*Sri B Sreeramamurthy*: I demand a division, Sir.

*The Minister for Local Adminstration (Sri K Brahmananda Reddi)* There is a rule in our Rules, Sir, that when votes of the Assembly are taken by division, it is not necessary that the Speaker should ask all the members to stand up It is enough if he calls upon the members who challenge the division to rise in their places Others need not stand up

*Mr Speaker* The point is, is the division claimed 'frivolously' It does not arise now

*Sri K Brahmananda Reddi* I am sorry It is not 'frivolous' The words used are 'unnecessarily' or 'frivolously' It is not 'frivolous', but it is 'unnecessary'

*Mr Speaker* The rule is 'If in the Speaker's opinion, a division is unnecessarily or frivolously claimed, he may call upon the members who challanged the division to rise in their places and may, after counting them, declare the result of the division ' I do not want to use my discretion in that manner

*శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) అధ్యక్షా, డివిజన్ అంటే ఏమిటో అర్థం చేసుకోకుండా వారు అంటున్నారు డివిజన్ అంటే తప్పనిసరిగా పేర్లు రికార్డుచేయాలి. అది సాంప్రదాయము కాని, ఒక్కొక్కప్పుడు పేర్లు రికార్డు చేయటం అవసరం లేదుగాని, స్పీకర్ చెప్పిన ఓటింగ్‌ను ఛాలెంజ్ చేసినపుడు, కౌంట్‌చేసి ఓటింగ్ డిక్లేర్ చేయమని ఆ రూలులో ఉంది సభ్యులు కూర్చుని ఉంటే, ఎలా కౌంట్ చేస్తారు? సభ్యులు నిలబడినపుడు కౌంట్ చేయాలి

*Mr Speaker* I agree with the opinion of the hon Leader of the Opposition

**Sri K Brahmananda Reddi* I would submit these few extracts for your consideration Sir The President declared that 'Ayes' have it, and there being cries of 'No.', said 'The volume of sound for 'Ayes' is so prepondering that I do not think a division is necessary Whereupon, a member said that upon Standing Order 32, even a single member was entitled to call for a division, the President observed: 'It is perfectly open to the President, if he is satisfied on the shout that there is a clear preponderence of opinion on one side and that the division is asked for frivolously and merely for the purpose of delay, to refuse the demand for a division.'

*Sri P Sundarayya* Under which rule? Not Andhra Rules

*Mr. Speaker* I am not using that discretion now,

The question is

"In line 2 of sub-clause (1) of clause 4, after the words 'natural calamities', insert the words or 'when the yield of the crops falls below 30% of the average obtaining for the previous three years' "

The motion was negatived

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 39 — Noes 83

The motion was negatived

*Sri P Narsing Rao* I beg to move

"In line 4 of sub-clause 1 of clause 4, for the word 'may' substitute the word 'shall' "

*Mr Speaker* Motion moved

*శ్రీ పి నరసింగరావు అధ్యక్షా, ఈ clause 4 లో "the Government may remit in whole or part in special" అని ఉన్నది ప్రతి Act లోనూ "May" అనేది రావడము సహజమే కాని యీ "May" అనే శబ్దము ఎప్పుడు కూడ ప్రభుత్వముయొక్క discretion మీద ఆధారపడి ఉంటుంది కాని అనుభవములో జరిగేది ఏమిటంటే యీ "May" అని ఉన్న చోట్లలో ప్రభుత్వము discretion use చేసే అన్ని విషయాలలో కూడ అది ప్రభుత్వానికే అనుకూలంగా వుంటుంది, గాని agrieved party ఎవరైతే వుంటారో అతనికి వ్యతిరేకముగానే ఉంటుందని అనుభవమువల్ల తెలుస్తున్నది అందువల్ల discretion అనేది ఎప్పుడుకూడ ప్రజలకు అనుకూలంగా ఉండదు. కనుక యీ "May" అనే దానికి బదులు "shall" అని పెట్టినట్లయితే అది mandatory అవుతుంది, statutory గా ఆ obligation ప్రభుత్వముమీదనే ఉంటుంది. గనుక "shall" అనేది పెట్టటానికి మంత్రిగారు ఒప్పుకోవలసిందిగా కోరుతున్నాను.

శ్రీ కె వెంకటరావు May కు అర్థము "shall" అనే దానికికూడ ఉన్నదని అనేక decisions లో వచ్చింది అందువల్ల దీనికి చర్చ అవసరములేదు.

*Mr Speaker* The question is

"In line 4 of sub-clause (1) of clause 4, for the word 'may' substitute the word 'shall' "

The motion was negatived

మిస్టర్ స్పీకర్ ఇంతటితో సభ వా యి దా వేయడమైనది తిరిగి సాయంత్రము నాలుగు గంటలకు సమావేశ మవుదాము

*The House then adjourned for lunch till Four of the Clock*

*The House reassembled after lunch at Four of the Clock*
[*Mr Speaker in the Chair* ]

## THE ANDHRA INAMS (ABOLITION AND CONVERSION INTO RYOTWARI) RULES, 1957

Rule 3

*Mr Speaker* Sri Pillalamarri Venkateswarlu may move his amendment (No 1) to Rule 3 of the Andhra Inams (Abolition and Conversion into Ryotwari) Rules, 1957

*Sri Pillalamarri Venkateswarlu* I beg to move ·
"In sub-rule (2) of Rule 3, for the word 'fifteen' substitute the word 'thirty'."

*Mr Speaker* Motion moved

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు · దీనిపైన general debate కూడా వుంటుందా? మన Assembly Rules లో ఉండాలని గాని, అక్కర లేదనిగాని ఎక్కడా వ్రాసుకోలేదు.

శ్రీ కె వెంకటరావు : Law క్రింద Government కున్న power క్రింద యీ rules చేశారు. Endorsement లో ఎక్కడయినా తప్పుంటే చెప్పడం తప్ప general discussion ఏమిటి ? Act మీద చర్చిస్తారా ? దీనిమీద చర్చిస్తారా ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు · Rule (3) యీ విధంగా వున్నది .

(1) "Every application under sub-section (1) of Section 3 shall be in writing, and shall specify the name and address of the applicant, the location, description and extent of the land in respect

of which he desires an enquiry to be held under the said section, and the nature of the interest claimed by the applicant in the said land "

(2) "The notice referred to in sub-section (2) of section 3 shall be in Form I and shall require every person or institution claiming an interest in the lands specified in such notice to file before the Tahsildar the statement of particulars referred to in the said sub-section, within a period of fifteen days from the date of publication of such notice "

15 రోజులకు బదులు 30 రోజులు అని సవరణ యిచ్చాము కావలసిన సమాచారం సేకరించడంకోసం కనీసం ఒక నెలరోజులయినా వుండాలనే ఉద్దేశ్యంతో పెట్టిన సవరణ యిది దీంట్లో పెద్ద principle involve అయినది కూడా ఏమీ లేదు కరణాలదగ్గర ఆభోగట్టా దొరకకపోతే తహసీల్దారువద్దకు పోవలసి వస్తుంది అందువల్ల కొంత కాలవ్యవధి యివ్వడం న్యాయంఅనే ఉద్దేశ్యంతో '30 days' అనే సవరణ పెట్టాము దీనిని వ్యతిరేకించడానికి కారణం కనబడడం లేదు

శ్రీ కె వెంకటరావు అవసరం వుంటే నేను ఒప్పుకునేవాడిని అవసరం లేదు Information యివ్వాలి ఒక వేళ information యివ్వకపోతే penalty పడితే తొందర పడాలి ఆలస్యంజరిగితే అనుకున్న కాలంలో enquiry పూర్తి కాకపోతే restorationజరగడం కష్టమవుతుంది తహసీల్దారు notice యిచ్చి enquiry చేయకపోతే కష్టమేనని నేను అంగీకరిస్తున్నాను కాని తహసీల్దారు 'on his own initiative enquiry' చేయాలి This is only to aid him ఏ రైతైనా ఈform లో యివ్వకపోతే అతనుతరువాత appear అయిenquiry conduct చేసుకోవడం విషయంలో ఏ విధమైన అభ్యంతరం వుండదు Speedy గా disposal కావాలని మనం అడుగు తున్నాం గనుక దీనిలో రైతుకుగాని, Tenant కు గాని వచ్చేనష్టం ఏమీలేదు త్వరలో పని పూర్తిచేసుకోడానికిది ఉపయోగిస్తుంది.

"The Tahsildar on his own initiative will issue the notice to know whether a person has got an inam in a ryotwari or zamindari village and whether it is held by a temple or some other institution." అన్నారు.

The only aim is to aid the person. దాంట్లో మిగిలిన details లేవు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు. Description, extent of the land అవన్నీ దీంట్లో అడిగారు.

శ్రీ కె. వెంకటరావు అది యివ్వకపోయినా ఫరవాలేదని చెబుతూంటే నష్టం యేముంది?

Let us take the other side The duty is laid upon the Tahsildar It is not on this Person It is only a supplemental thing

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు తహసీల్దారు తగినంత శ్రద్ధ చూపకపోతే రైతు తన హక్కులకోసం సరైన శ్రద్ధ తీసుకోవలసిన అవసరం వుంది అందు చేత 15 రోజులకు బదులు 30 రోజులని సవరణ చెప్పాము

శ్రీ కె. వెంకటరావు దీనివల్ల ఎవరికైనా లాభిస్తే తప్పకుండా ఒప్పుకునేవాడిని ఎవరికీ ఉపయోగం లేని విషయంలో 15 రోజులను 30 రోజులుగా చేయడం వల్ల ప్రయోజనం లేదు

*Sri Pillalamarri Venkateswarlu* I beg leave of the House to withdraw my amendment

The amendment was, by leave of the House, withdrawn

Rule 4

*Sri G Yellamanda Reddi* I beg to move

"Add the following proviso at the end of Rule 4

'Provided in cases when the petitioner is not in posession of exact facts he may be allowed to give details to the best of his knowledge' "

*Mr. Speaker* Motion moved.

శ్రీ జి. యలమందారెడ్డి : సాధారణంగా తహసీల్దార్లు దరఖాస్తులను విచారించేటప్పుడు వాళ్లు యిచ్చే వివరాలు inam lands విషయములో దొరకడం చాలా కష్టం. అది దొరకలేదు, యిది దొరకలేదు, అని ఆ basis మీద petitions reject చేయడం కాకుండా అదే form లో తనకు ఎంతవరకు సమాచారం అందుబాటులో వుంటుందో అంతవరకు యివ్వడానికి అవకాశం కల్పించాలి కరణాలు మునసబులు యీ భోగట్టా supply చేయవలసిన అవసరం వుంటుంది Form IV లో T. D నంబరు, S. O నంబరు, classification, extent, remarks, యివన్నీ కేవలం obligatory గా చెబుతున్నారు. అభోగట్టా

తీసుకురావాలని నిర్దేశించడంవల్ల చిక్కులకు అవకాశం వుంటుంది అందువల్ల general గా రైతు తనకు తెలిసిన సమాచారం యిస్తే తహసీల్దారు తప్పని సరిగా దానిని supplement చేసుకోవలసిన అవసరం వుంటుంది ఇదివరకు మన అనుభవం యేమిటంటే తప్పనిసరిగా objection పెడతారు ఏ ఒక్క అంశం పూర్తి కాకపోయినా యీ petition యొక్క purpose fail అవుతుంది కాబట్టి తప్పనిసరిగా ఈ అవకాశం కల్పించాలని నేను అభిప్రాయ పడుతున్నాను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా! శ్రీ ఎల్లమందా రెడ్డి గారు తెల్పిన విషయాలతోపాటు మరి రెండు విషయాలను మంత్రిగారిదృష్టికి తీసుకు రాదలిచాను రూల్సులోగాని చట్టములోగాని information ఇవ్వటంలో ఏకొద్దిలోపం ఉన్నా ఆ పిటిషన్‌ను కొట్టివేయటం జరుగుతుందని టెనెన్సి యాక్టులో మనకుగల అనుభవంవల్ల తెలుసును ఆ అనుభవాన్ని పురస్కరించుకొని అటువంటివి ఇక్కడకూడా జరుగుతాయేమోననే భయంతో దీనిని తీసుకు వస్తున్నాము ఇందులో 'ఇన్ని రోజులలోగా submit చేయాలి' అని వుంది. కరణాలవద్దకు పోతే ఆ లెక్కలు వారివద్ద దొరకవు, అందువల్ల ఎప్రాక్సిమేట్‌గా ఇచ్చినప్పటికి accept చేయాలనే ఒక 'ప్రొవైసో'ను మనం ఏర్పరిస్తే తహసీల్దారు ఏ టెక్నికల్ గ్రౌండుపై కూడా reject చేయకుండా పిటిషనర్స్‌ను రక్షించటానికి వీలువుంటుంది 'ఆ ఉద్దేశ్యంతో దీనికి మేము నోటీసు ఇచ్చాము ఈ purpose ఇంకోవిధంగా serve అవుతుందని మంత్రిగారు సెలవిస్తే దానిని మేము press చేయము ఏదోవిధంగా ఈ purpose ను serve చేయవలసిన అవసరం వుంది ఒక కాపి ఇచ్చారనో, రెండు కాపీలు ఇచ్చారనో, ఎక్కడో ఏదో కొట్టివేశారనో, లేక నాల్గు రోజులు ఆలస్యమైనదనో చెప్పుతున్న విధానంలో మన టెనెన్సి యాక్టు అమలులోవున్న అనుభవాన్ని బట్టి దీనికి అదేగతి పట్టకుండా రైతుకు అనుకూలంగా వుండే విధంగా సడలించాలనే ఉద్దేశ్యంతో మేమిది ఇచ్చాము దీనిని మంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు. అధ్యక్షా! ఈ విషయం ఇప్పుడే ఆలోచించాము It is a simple form; legal binding లేనిది. When he was evicted and from which land he was evicted అనే information దానిలో కావాలి. Unsurveyed villages వున్నాయి. 'ఫలానా సరిహద్దులో వున్న భూమిని 1-1-1948 న నేను వ్యవసాయం చేస్తున్నాను. అది నా possession లో వుంది' అని తెలియపర్చటానికి intend అయినదే ఈ form III కాని దానిలో వెంకటేశ్వర్లుగారు అనుకొనే పరిస్థితి లేదు,

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు ఎప్పుడు ఇటువంటివి రావని మంత్రిగారు చెబుతున్నారు మంత్రిగారు చెప్పినవాటిపై మనకు విశ్వాసం వుండవచ్చు మనం వాటిని ఒప్పుకోవచ్చు కోర్టులకు వెడితే మంత్రిగారు చెప్పింది కదా అని వారుచూడరు చట్టాలలో, Rules లో exactగా ఏమిఉందో దానికివిలువఇస్తారు కాని ఫలానారోజు, ఫలానా గంటలకు మంత్రిగారు ఎసెంబ్లీలో ఇలా చెప్పారు అంటే ఎవరూ విలువ యివ్వరు, ఇవ్వటంలేదు రైతులను ఉద్ధరించటానికే Tenancy Act తెచ్చినట్లు చెప్పాము కాని అదే రైతులను నేడు భక్షిస్తున్నది అలాంటి పరిస్థితి దీనికి కూడా వస్తుందేమో ననిపిస్తున్నది అందువల్ల హామీలు ఇస్తే సరిపోదు ఇచ్చిన హామీలను అక్షరాలతో చట్టంలో వ్రాస్తేనే ఉపయోగ పడతాయి లేకపోతే యేమీ ఉపయోగపడవు •

శ్రీ ఇ అయ్యపురెడ్డి (నందికొట్కూర్-జనరల్) అధ్యక్షా. సబార్డినేట్ లెజిస్లేషన్ కమిటీ త్వరలోనే meet కాబోతోంది ఈ tenancy legislation క్రింద delegated power క్రింద చేసిన rules ను అక్కడ చర్చించబోతున్నాము కనుక ఎలమందారెడ్డిగారు, వెంకటేశ్వర్లుగారు raise చేసిన points ను అక్కడ చర్చించి, ఏ సూచనలద్వారా సక్రమంగా జరుగుతుందో ప్రభుత్వానికి తెలియజేస్తే బాగుంటుంది కాని ఇప్పుడు ఈ చర్చ అనవసరమని అనిపిస్తున్నది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, దీనికి సబార్డినేట్ లెజిస్లేషన్ కమిటీకి సంబంధంలేదని నేను అభిప్రాయ పడుతున్నాను మనం యాక్టుద్వారా వారికి యిచ్చిన హక్కులకు అనుగుణంగా ఆ రూల్సు వున్నాయా, కానిస్టిట్యూషన్‌కు పరిధికి ఎంక్రోచి అయినదా ? ఇచ్చిన హక్కులకంటె ఎక్కువ తీసుకున్నదా అని అడగటానికి తప్పితే day to day వున్న difficulties పరిశీలించి సరిదిద్దే హక్కు ఆ కమిటీకి వుందని నేను అనుకోవటం లేదు. ఉన్న difficulties మేము దిద్దుతామని వారు చెప్పారు వారి 'spirit' ను కాదని నేను అనటం లేదు కాని వారికి ఆ అధికారం లేదు వారి కిచ్చిన powers ఇవి ఎప్పుడు ఏ order ఇవ్వాలి ? ఎవరిద్వారా జరపాలి అవన్నీ further details లోకి వస్తాయి, లేక day to day administration క్రిందకు వస్తాయి కనుక ఇక్కడ చర్చించటము మంచిదని అనుకొంటున్నాను.

శ్రీ జి. ఎలమందారెడ్డి . అధ్యక్షా, ఈ చట్టంవల్ల చాలా అన్యాయం జరుగుతున్నట్లు, గోల చేస్తున్నట్లు మీకు తెలుసు. ఆచరణలో ఏవిధంగా వుంటుందో మునుపటి చట్ట సందర్భంలో మనవి చేశాము. తహసిల్దారువద్దకు వెళ్ళినా

ఏ orders అములులోనికి రావు నెంబరు యిచ్చినా సరిపోతుందని మంత్రిగారు అన్నారు కేటగారికల్‌గా సర్వేచేసివుంటే సర్వేనెంబరు extent ఎంత అని ఇవ్వాలని, సర్వే కాకపోతే ఉజ్జాయింపు లెక్క ఇవ్వాలని వుంది ఎన్నో రోజులనుండి భూమిపై హక్కు కల్గిన tenants ను వెళ్ళగొట్టాలని నోటీసులు ఇస్తే, తహసిల్దారు కోర్టులో, కలెక్టరు కోర్టులో trespass క్రింద వారిని వెళ్ళగొట్టుతున్నారు

శ్రీ కె వెంకటరావు దానికి దీనికి ఏమీసంబంధంలేదు ఏదో మాట్లాడాలి అనుకుంటే తప్ప

శ్రీ జి. యలమందారెడ్డి దీనికికూడా complaint చేయవచ్చు దానికి సంబంధించినంతవరకు ఇది difinite గా చెప్పబడింది సర్వేనెంబరు విస్తీర్ణం చెప్పడంలో తనకు తెలిసిన particulars చెప్పటంవల్ల వచ్చే difficulty ఏదో మంత్రిగారు చెప్పాలి తన క్రిందవున్న గ్రామంలో ఏ లెక్క కావాలన్నా తెప్పించుకొనే అవకాశం, తహశీల్దారుకు వుంటుంది కాబట్టి మంత్రిగారు దీనిని అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, అయ్యపురెడ్డిగారు చెప్పినట్లు సబార్డినేట్ లెజిస్లేషన్ కమిటీలో ప్రత్యేకంగా rules frame చేస్తే మరోవిధంగా వుంటుంది కాని అది meet కావాలి, ఆ కమిటీముందు అనేక rules ఉన్నాయి. అవన్నీ ఫైనలైజ్ కావాలి. అవన్నీ అయ్యాక దానిని ఫైనలైజ్ చేసి ఒక రూపంలోనికి తీసుకురావాలి అలా సబార్డినేట్ లెజిస్లేషన్ కమిటీ చెప్పినట్లుగా చేసేటట్లుగా వున్నా, ఈ లోపల ఏమిచేయాలనేది ఆలోచించవలసి ఉంది ఉన్న అనుభవాలను పురస్కరించుకొని అయ్యపురెడ్డిగారు ఆలోచించాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు . అధ్యక్షా, దీనిని అంగీకరించవలసిన అవసరంలేదు మైమాయిషి నెంబరు ఇవ్వవచ్చు. స్పష్టంగా ఇంకోటి అవసరంలేదని నేను మనవిచేశాను. 10 ఏండ్లక్రితం ఉన్నభూమి నాది, నేను పనిచేస్తున్నాను, అని చెప్పదలచుకొన్న వ్యక్తి ఏరోజున ఏ సర్వేనెంబరు భూమికి రైతుగా ఉన్నాడో చెప్పలేని పరిస్థితిలోవుంటే ఇంకా ఇది ఎందుకు ఉపయోగిస్తుంది? కొత్త విషయాలు చెప్పటంలేదు, ఋజువు చేసుకోమని చెప్పటంలేదు "నేను ఫలానా తేదీన ఫలానా పొలంలో ఫలానా వారిక్రింద tenant గా వున్నాను" అని

చెప్పే పరిస్థితిలేకుండా law administer చేయటం కష్టము ఇది చాలా loose form కాని strict గా ఎవరి హక్కును భంగపరచని స్థితిలో లేదు. కనుక నేను అంగీకరించటము లేదు

*Mr Speaker* The question is

"Add the following proviso at the end of Rule 4 — 'Provided in cases when the petitioner is not in possession of exact facts he may be allowed to give details to the best of his knowledge' "

The motion was negatived

*Sri G Yellamanda Reddi* I demand a division, Sir

The House then divided

Ayes 19 Noes 44

The motion was negatived

*Rule* (6)

శ్రీ కె. వెంకటరావు Point of order, Sir ఇది section 6 (2) కు సంబంధించినది పంపకం ఎలాచేయాలి అనే విషయంగురించి అందులో తహశీల్దారుకు అధికారం యిచ్చారు ఈ amendment దానిని exceed అవుతుంది అసలు Original Act నే offend చేస్తుంది కనుక అది ultra-vires

"On receipt of such an application the Tahsildar, shall cause to be served in the prescribed manner a notice on the inamdar and the tenant, give them reasonable opportunity of being heard and determine the particular portion of the inam land to be given to the inamdar under clause (b) or clause (c) of sub-section (2) of Section 4 towards his one-third share In so determining the Tahsildar shall have due regard to the nature and value of the land and the convenience of cultivation thereof" అని ఉంది

"Give them reasonable opportunity of being heard and determine the particular portion of the inam land" అని clear గా ఉన్నది కాని యీ amendment ప్రకారం తహశీల్దారుకు ఉన్నటువంటి హక్కును తీసేసి, tenant కే choose చేసుకొనేహక్కు యివ్వవలసినదని ఉన్నది It is ultra-vires of the Act.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఇప్పుడు గౌ॥ మంత్రిగారు చదివినదంతా Act లో ఉండనేఉన్నది ఆ Act, Rules దగ్గర పెట్టుకొనే మేము యీ amendment వ్రాశాము ఇది ఏవిధంగా కూడా Act కు ultra-vires కాదు. తహశీల్దారు determine చేయాలని Rules లో ఉన్నది ఏ విధంగా determine చేయాలి అనే procedure అంతా దీంట్లో ఉన్నది తహశీల్దారు తన యిష్టం వచ్చినట్లు determine చేయవచ్చు చీటీలు వేసి తీసుకోమని చెప్పవచ్చు, రెండు భాగాలుగా విభజించి దాంట్లో ఒకభాగం ఒకటి కోరుకోమనవచ్చు. చాలా పద్ధతులున్నాయి ఆ అధికారం తహశీల్దారుకు ఉన్నది తహశీల్దారుకు యిన్ని methods ఉన్నాయి కాబట్టి, ఏదో ఒక particular method అయితే బాగుంటుందని Rules లో provide చేస్తున్నాము దీనిని Rules లో provide చేస్తే, Act యొక్క purpose ను defeat చేయదు Act యొక్క intentionను అంతకంటే defeat చేయదు అసలు Act యొక్క intention ఏమిటి ? రైతుక్రింద కొంతపొలం ఉన్నది దానిని రైతు ఎన్నాళ్ళనుంచో సాగుచేసు కుంటూ అనుభవిస్తున్నాడు ఈనాందారుకు అందులో ⅓ భాగం యివ్వాలి తహసీల్దారు భూమి యొక్క స్వభావాన్ని దృష్టిలో పెట్టుకొని పంచాలి అని ఉన్నది అట్లా పంచేటప్పుడు ఏ పద్ధతి అవలంబించాలో Rules లో ఖచ్చితంగా చెప్పలేదు తహసీల్దారుకు అధికారం యిచ్చారు, కాని ఫలానపద్ధతి అవలంబిం చాలని Act లో ఎక్కడకూడా లేదు Act లో ఉన్న provision ను మానవరణ ఏవిధంగానూ offend చేయదు Procedure దీంట్లో specific గా ఉన్నది ఇప్పుడు 'రైతు హక్కులలో భూమి ఉన్నది, కనుక ఆ భూమిని భాగాలుచేసి కోరుకునే అధికారం రైతుకే యివ్వడం న్యాయ'మని Rules లో మనం చెబుతున్నాము మంత్రిగారు దీనిని ఏ విధంగా వ్యతిరేకిస్తున్నారో నాకు అర్థంకావడం లేదు Act యొక్క spirit చూచినప్పటికి, Act యొక్క intention తీసుకొన్నప్పటికి కూడ, ఆ section యొక్క purpose తీసుకొన్నప్పటికి కూడ యిదే ఉన్నది తహశీల్దారుకు arbitrary power ఇచ్చినట్లయితే తహశీల్దారు తన యిష్టంవచ్చి నట్లుగా రైతుల భూమిని తీసుకుపోయి, యీనాందారుకు పంచిపెట్టాలని ఎక్కడాలేదు ఆ విధంగా వుంటే అసలు Act pass అయ్యేదికాదు.

శ్రీ కె. వెంకటరావు · ఆ Act pass అవునో, ఏమిఅవునో నాకు తెలియదు కాని ఆ యాక్టు pass అయినది, అమలులో నున్నది. దానిని గురించి rules వచ్చాయి. Section 6 (g) లో 'where no joint statement has been filed' అని ఉన్నది. ఇద్దరూ అంగీకరించి statement ఇచ్చినప్పుడు ఆ ప్రకారం చేయ వలసి ఉంటుంది

(g) where no joint statement has been filed but an application has been filed under sub-section (1) of Section 6, by the inamdar or the tenant or both within the time specified in clause (c), the Tahsildar shall proceed to determine under sub-section (2) of Section 6, the particular portion of the inam land to be given to the inamdar "

"Where there is dispute between the tenant and the inamdar, it is the Tahsildar that has to determine The word 'determine' is such a strong word that it is not possible for anybody to choose between the two " అని ఉంది

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు Tenant ఒక భాగం తీసుకొని, మిగిలినది యీనాందారుకు యివ్వాలని కాదు మేము చెబుతున్నది Act లో ఉన్న ప్రకారం తహశీల్దారే నిర్ణయిస్తాడు నిర్ణయాధికారం తహశీల్దారుకే ఉన్నది ఆయన ఏవిధంగానైనా పంచవచ్చు చీట్లువేసి పంచవచ్చు, లేకపోతే కళ్ళు మూసుకొని ఏదోఒకటి తీయవచ్చు ఇప్పుడు మనం ఒక procedure lay చేస్తున్నాము అసలు Rules యొక్క purpose ఏమిటి ? ఇలాంటి procedure ను lay చేయడానికే Rules intend కాబడినాయి ఇద్దరూ రాజీపడితే తహశీల్దారుదాకా రానేరారు

శ్రీ కె వెంకటరావు "And shall give preference to the tenant to choose his land" అని వ్రాసి, నిర్ణయాధికారం తహశీల్దారుకే ఉన్నదని argue చేస్తే ఏమిటి అర్థం ?

శ్రీ బి. యలమందారెడ్డి మా నవరణలో తహశీల్దారు అధికారానికి ఎలాంటి యిబ్బంది లేకుండానే ఉన్నది ఫలానా భూమి అని తేల్చేముందు, ఏ పద్ధతి అవలంబించాలనే విషయం ఒకటున్నది దానిని గురించి చట్టంలో "భూమి ఎక్కడ ఉన్నది, fertility ఏమిటి" యిలాంటివన్నీ తీసుకోవాలని ఉన్నది మేము కూడా ఒక method చెప్పాము. ఆ రకంగా యివన్నీ చూచి తహశీల్దారు నిర్ణయించిన తరువాత, ఆ particular land కు అప్పుడు పట్టా యిస్తాము తహశీల్దారు తన యిష్టంవచ్చిన procedure అవలంబించి ఫలానా భూమి ఈనాందారుది, ఈ భూమి రైతుది అని నిర్ణయించిన తరువాత పట్టాలు ఇవ్వడం జరుగుతుంది. Particular land అని decide చేసేముందు సాధారణంగా ఎవ్వరికి యిబ్బందిలేకుండా వుండే procedure అవలంబించబడుతుంది కాని particular land యివ్వడానికి యిందులో తహశీల్దారుకు యిబ్బందిలేదు ఆయన rights ను తీసివేసే విషయం యిందులో ఏమీలేదు అందువల్ల ఫలానా భూమి అని decide చేయడానికి అవలంబించే procedure కు సంబంధించిన విషయంతప్ప,

తరువాత పట్టాయివ్వడానికి గాని, చట్టంలో ఉన్నటువంటిదానికి గాని ఏలాంటి ఆక్షేపణా లేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, 'shall' అనేదానికి stress చేస్తున్నారు ఇందాక 'may' means shall అని చెప్పారు అదే యిక్కడ కూడా వర్తింపజేసి, 'shall' means 'may' అని పెడితే accept చేయడానికి మాకు అభ్యంతరం లేదు

మిస్టర్ స్పీకర్ The Act definitely gives whole power to Tahsildar తన దగ్గరకు వచ్చి చెప్పుకుంటే అది వేరే సంగతి అతని దగ్గర చెప్పుకొంటే, రైతుపై సానుభూతి చూపించవచ్చు ఇద్దరు అన్నదమ్ములుండి, వారిద్దరి ఆస్తి భాగాల సందర్భంలో కూడా తహశీల్దారే చర్య తీసుకోవాలి Act వల్ల అతనికి ఉన్న హక్కును మీ సవరణ limit చేస్తోంది

ఆ $\frac{1}{3}$ share ఎక్కడ యివ్వాలనేది తహశీల్దారు నిర్ణయం చేయాలి ఆ భూమిని 3 భాగాలు చేయాలి తన భూమిని choose చేసుకోడానికి tenant కే preference యివ్వాలి అంటున్నారు దీనివల్ల తహశీల్దారుకు హక్కు పోతున్నది, కనుక అది ultra-vires

Therefore it is ultravires It is against the Section I accept the position of the hon Minister The amendment is therefore ruled out

*Rule 9*

*Sri Pillalamarri Venkateswarlu* Sir, I beg to move

Add the following proviso at the end of sub-rule (3) of Rule 9

"Provided that if the petition for eviction is to be allowed, the Tahsildar shall see that an equitable compensation is paid to the tenant for his rights of permanent occupancy"

*Mr. Speaker*. Motion moved.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు · ఈ Act ప్రకారం రైతుకు permanent occupancy rights కలుగజేసినాము తరువాత తాను చెల్లించవలసిన కౌలు మొత్తాన్ని చెల్లించలేదనే కారణంచేత, అతనిని వెళ్ళగొట్టవచ్చు అనే provision ఏర్పాటు చేశారు Permanent occupancy rights లో heriditary rights

కొన్ని ఉన్నాయి దాంట్లో భాగాలు పంచుకోవచ్చు, అమ్ముకోవచ్చు ఎప్పుడో ఒక సంవత్సరం కౌలు మొత్తం చెల్లించడంఆలస్యం అయింది, కనుక పూర్తిగా ఆస్తి, rights అన్నీకూడా యీ విధంగా రద్దు చేయడం సరిగాలేదు కనుక మిగిలిన rights కు equitable compensation యివ్వాలని మేము provide చేశాము కనీసం దానినైనాసరే మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాము

*Sri K Venkata Rao* The point is very clear, Sir It is not an absolute right It is right which is governed by the payment of rent and non-encumberment of land, because what is granted is limited by these two conditions

శ్రీ కె యల్ నరసింహారావు On a point of clarification, sir, ప్రస్తుతంవున్న పరిస్థితుల ప్రకారం పట్టాదారు గనుక land revenue కట్టక బాకీపడినట్లయితే వారి భూములను ప్రభుత్వమే తీసుకొని హర్రాజు చేస్తున్నది ఆ విధంగా హర్రాజుచేసి, ఎంతమొత్తం తనకు రావలసివున్నదో దానిని జమ కట్టుకొని, మిగిలినది పట్టాదారునికి వాపసు యిస్తున్నది ఆ విధంగానే అతనికి occupancy rights కూడా వున్నవి వాటిని అతడు ఆచంద్రతారార్కంగా అనుభవింపవచ్చునని కూడా మంత్రిగారు యింతకుముందే సెలవిచ్చారు అయితే పట్టాదారుకు ఆ విధంగా ఆ భూమిని అనుభవించే హక్కు వున్నప్పటికీ— ఒకవేళ ఏ కారణంచేతనో అతను ఆర్థికంగా చితికిపోయి, మునుపటిలాగ సరియైన సైముకు పన్ను చెల్లించలేకపోయినప్పుడు, ఆ నేరానికి అతనివద్దనుండి భూమిని లాగుకుని, ఆ భూమిపై అతనికుండే హక్కులను రద్దు చేసేదానికన్నా- అతనికి వున్న హక్కును బజారులో వేలంవేసి, ఆవిధంగా వచ్చిన ఆదాయంలోనుండి ప్రభుత్వానికి రావలసినది తీసుకుని, మిగిలిన దానిని తిరిగి అతనికే జమకట్టే ఏర్పాట్లుచేస్తే బాగుంటుంది అంతేగాని, అతడు తనకున్న అనేక ఆర్థిక పరిస్థితుల వల్ల పన్నును సకాలంలో చెల్లించలేదనే కారణంతో ఆ భూమిపై అతనికి గల హక్కుల నన్నిటినీ పూర్తిగా రద్దుచేయవలయును అనుకొనడం న్యాయం అనిపించుకోనదు

శ్రీ జి. ఎలమందారెడ్డి అధ్యక్షా, యింతకుముందు మంత్రిగారు చేసిన ప్రసంగం కేవలం 2+2=4 అనే రకంగా spirit ను చాలావరకు simplify చేసి చెప్పారనే నా అభిప్రాయాన్ని తమతో మనవి జేస్తున్నాను సాధారణంగా కౌలుదారుకు భూమిపై నుండే occupancy right కు యీనాడు దేవాలయ భూమిలో మనచట్టం ప్రకారం provide చేసినటువంటి occupancy హక్కుకూ చాలా తేడావుందా, లేదా అనే విషయాన్ని ముందు మనం గ్రహించాలి.

మిస్టర్ స్పీకర్ ఈ Rules లో ఆ విషయాన్ని గుర్తించాలి అంటారా ?

శ్రీ జి ఎలమందారెడ్డి Rules లో కాదుగాని, చట్టంలో ఈ విషయాన్ని గుర్తించారండి మంత్రిగారు యింతకుముందు చదివినట్లుగా—ఈ భూముల లోని చెరువుల అభివృద్ధికిగాని, లేదా యితర వసతుల అభివృద్ధికిగాని, కాంపెన్సేషన్ ప్రొవైడ్ చేయవలయునని చట్టంలోనే వుంది దానికే మేము యింకా కొన్ని విషయాలు add చేశాము మనం గుర్తించిన యీ భూమిపై హక్కులు సాధారణమైనవి కావు అందువలన కేవలం శిస్తు కట్టనంత మాత్రాన తరతరాలుగా వచ్చే హక్కులను ఊడదీయం అనే విషయం గుర్తించాలి

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఇవి Religious endowment lands కు అని గ్రహించాలి

మిస్టర్ స్పీకర్ I am going to give my ruling No more discussion is necessary ఇప్పుడు Rules అన్నింటినీ 17 వ section క్రింద చేస్తున్నారు

Purpose of this Act ను carry out చేయడంమటుకే తప్ప Rules లో కొత్త rights గాని, కొత్త obligations కాని create చేయడానికి వీలులేదు ప్రస్తుతం వున్న sections ప్రకారం దీనిని ఏ విధంగా చేయవలయును, ఎన్నాళ్లు వాయిదా వేయవలయును, agrieved party ఏమని appeal చేయవలయును అనేటటువంటి దానికి తప్ప మనము ఏమీ చేయటానికి వీలులేదు

స్థానికస్వపరిపాలన శాఖామంత్రి (శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి) : Provisions of the Act inconsistant గా ఉండరాదు.

*Mr Speaker* The Rules shall have the effect as the Sections under the power to make rules The Government, may, by notifications make rules to carry out the purposes of this Act, అని ఉంది

Rules are mere procedure They cannot confer new substantive rights on any of the parties I must only see Section 9

*Mr. Speaker* · "On receipt of such an application, the Tahsildar shall cause a notice to be served in the prescribed manner on all the persons and institutions concerned and after hearing their representations if any, pass an order either allowing the application or rejecting it While passing an order allowing the application for eviction, the Tahsildar may make such further orders as appear to him to be just and equitable," అనివున్నది.

This amendment is also ultravires because it gives new powers in giving compensation because of the fact he possesses occupancy rights Hence I rule it out of order

*Sri Pillalamarri Venkateswarlu* Sir, I beg to move

Add the following as new sub-rule (4) at the end of Rule 10 (3)

"(4) Any tenant who is evicted for the first time shall be given preference at the time of leasing out such land"

*Mr Speaker* Motion moved

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, పట్టాదారులు కౌలు చెల్లించక పోవడం వలన భూములనుండి వారిని evict చేసినతరువాత దానిని తిరిగి పర్మినెంటు ఆక్యుపెన్సీకి ఎవరికి యివ్వాలి అనే సమస్యకూడా యిందులో యిమిడి వున్నది. ఒకసారి సెలెక్టు కమిటీలో యీ విషయమై యోచిస్తున్నప్పుడు యీ సమస్యకూడా అప్పుడు వచ్చింది ఆ సందర్భంలో తమరుకూడా అక్కడనే వున్నారు అనుకొంటాను ఆసమయంలో Select Committee లో—యీ విధంగా evict చేసిన తరువాత దానిని తిరిగి ఎవరికి permanent గా యిచ్చి వేయాలి? అనే విషయం—తిరిగి రూల్సు గురించి ఆలోచించేప్పుడు—దానిని పరిష్కరించవచ్చును అనుకోవడం జరిగినది ఆ విధంగానే యిప్పుడు మనం Rules చేయవలయునని అనుకొంటున్నాం గనుక ముందు యీ సమస్యను పరిష్కరించవలసి యున్నది దీనిని గురించి clear గా Act లో కూడా ఏమీ లేదు పైగా రూల్సులో ఆ విధంగా చేయగూడదని కూడా ఏమీలేదు అయితే మేము రూల్సు ఏ విధంగా వుండాలని సూచిస్తున్నామంటే—ఒకవేళ అతను గనుక కౌలును సమయానికి చెల్లించక పోయినట్లయితే—అతనిపై అదనంగా జరిమానా వేసి, ఏ విధంగా Land Revenue కట్టడం ఆలస్యం అయితే ప్రభుత్వమే వడ్డీని అసలు ఫాయిదాలతో ఎలా వసూలు చేసుకుంటున్నదో, అదేవిధంగా యిప్పుడుకూడా చేయడమో, లేక యింకా కొంత మొత్తాన్ని అతనిపై penalty గా వేసి, అది కట్టినతరువాత తిరిగి అతనికి ఆ భూమిని యిచ్చేపద్ధతి పెట్టడమో న్యాయంగా వుంటుంది వంశ పారంపర్యంగా అనుభవిస్తున్న అతని హక్కులను—ఏదో ఒక సాలు కౌలు చెల్లించలేదన్నే కారణంతో రద్దుచేయడం వంటి అధికారాలను తహసిల్దారు వంటి వానికి యివ్వడం సబబుకాదు అటువంటి అధికారాలను ఏ హైకోర్టు జడ్జికో యిచ్చినట్లయితే, ఆవిషయాన్ని, అతను జాగ్రత్తగా ఆలోచించి. సరియైన పరిష్కారం చేయడానికి వీలుగా కూడా వుంటుంది (Interruption) కాని అటువంటిదేమిలేదు. అందువల్ల యీ విషయమై

నేను సూచించేది ఏమంటే—ఒక వేళ అతని హక్కులను రద్దుచేసినప్పటికీ, తిరిగి permanent occupancy కి ఎవరికైనా యిచ్చేటప్పుడు యితనికి ముందు preference యివ్వవలసిందిగా కోరుతున్నాను ఆ విధంగా అతను తను చెల్లించ వలసిన మొత్తానికి హామీగాని, ధవరాత్తుగాని తీసుకునివచ్చినప్పుడు అతనికికూడా అవకాశం యివ్వడం న్యాయం, దానినిగురించి ఆలోచించ వలసిందిగా ఒకసారి మేము Select Committee ముందుకు తీసుకవచ్చాము అపుడు అందులోవున్న సభ్యులందరికీ యీ విషయం గుర్తువుండే వుంటుంది ఏదో కొంతడబ్బు యివ్వ లేదనే కారణంచేత రైతును భూమినుంచి తొలగించినప్పటికి అతడు ఆ డబ్బును తిరిగి యిచ్చినట్లయితే అతనికే తిరిగి ఆ భూమిని యివ్వవలెననే మా సవరణను తప్పనిసరిగా మంత్రిగారు ఆమోదించాలని కోరుతున్నాను

శ్రీ యస్ కె వి కృష్ణావతారం (తాడేపల్లిగూడెం-జనరల్) అధ్యక్షా. ఈ బిల్లును పరిశీలించిన సెలెక్టు కమిటీలో నేనుకూడా ఉండడం తటస్థించింది రైతులకు ఆక్యుపెన్సీ రైట్సులేని యీ మైనర్ యీనాం భూములలో ఏదో ఒక విధంగా కౌలు బేసిస్‌మీద హక్కులు కలుగజేయడం జరిగింది మద్రాస్ ఎస్టేట్సు లాండ్ ఆక్టుకు సంబంధించిన భూములకు యీ భూములకు ఎట్టి తేడా లేదని కొందరు అనుకుంటున్నారు కాని అది సరియైన విషయంకాదు దేవాదాయ ధర్మాదాయాలకు సంబంధించిన భూములివి ఇంతకుపూర్వ మెన్నడూ రైతుకు యీ భూములలో ఆక్యుపెన్సీ హక్కులేనే లేదు బహిరంగ వేలంద్వారా హెచ్చు పాటపాడిన వానికే యీ భూముల నివ్వడ మనే విధానం ఎంతో కాలంగా ఉంటూవుండినది ఈ దేవాదాయ ధర్మా దాయ సంస్థలకు లాభకరంగా వుండే పద్ధతినే కౌలుకు యివ్వడం జరుగుతూ వుండేది ఈ భూములకు సంబంధించినంతవరకు రైతులకు హక్కులు కలుగ జేయ వద్దని ఎంతో దెబ్బలాడాము ఈ సంస్థల భూములను వేలం పాడేవారు సాధారణంగా పెద్ద భూస్వాములుగానే వుంటారు అట్టివారు డిఫాల్ట్ అయి నప్పటికీ వారికే యీ భూములను తిరిగి సంక్రమింపజేయాలనేది సబబుగా కనిపించడంలేదు శిస్తును సరిగా యివ్వకపోవడంవల్ల భూమిలో గోతులు త్రవ్వడం వంటి హానికరమైన పనులు చేసినట్లయితేనే రైతును చట్టరీత్యా ఎవిక్టు చేయడం జరుగుతుంది. అట్టివారికే యీ భూములను తిరిగి యీయ వలెనని చెప్పడంవల్ల సంస్థకు మనం లాభం చేకూర్చుతున్నామా అని ఆలో చించాలి కాబట్టి యీ సవరణను అంగీకరించడానికి వీలులేదని మనవి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ దేవాదాయ, ధర్మాదాయ సంస్థలకు సంబంధించిన భూములనుంచి రైతులను తొలగించవలెనంటే చట్టరీత్యా తహసీల్దారుకు తెలియ పరచవలసి వుంది

"Any institution may file an application before the Tahsildar to evict a tenant "

ఈ సంస్థలకు చెందిన భూములకు హానికరమైన విధంగా ఏరైతు ప్రవర్తించినప్పటికి అందుకు పరిహారాన్ని కోరుతూ తహశిల్దారుకు దరఖాస్తు పెట్టుకోవచ్చుననే అవకాశంకూడా వున్నది అట్టి రైతులను భూములనుండి తొలగించుటకు కూడా తహశిల్దారుకు సంస్థ తరఫున దరఖాస్తు పెట్టుకోవచ్చు

"An institution may apply to the Tahsildar for the award of compensation in addition to or in lieu of eviction, for the damage or waste caused by the tenants "

ఈ నాడు రైతులకు యీ భూములలో వున్న హక్కు సందేహాస్పదమైనది సంస్థకు నష్టము జరిగేవిధంగా వారు భూములను పాడుచేయరాదు అట్టి దేదైనా జరిగినట్లయితేనే అతడు తొలగింపబడతాడు అటువంటి పరిస్థితులలో అతనికే ప్రిఫరెన్సు యివ్వాలనడం ఎంతవరకు న్యాయమో ఆలోచించుకోవాలి

"When the permanent occupancy rights were doubtful, if they were clear, how can the question of eviction come?"

"When he is damaging the land itself, even under the old Estates Land Act, the ryot is bound to keep the land in a proper condition If he spoils it and so on, the zamindars could evict him "

ఇప్పుడు మనముందున్న సవరణ చట్టాన్ని చర్చించే సమయములో ప్రతిపాదించవలసినదేగాని, రూల్సు సందర్భములో చేయడానికి వీలులేదు రైతు చట్టరీత్యా భూమినుండి తొలగింపబడినప్పుడు, ఆ సంస్థ ఆ భూమిని మరొకరికి కౌలుకు యివ్వవచ్చు

'Suppose the eviction takes place Then, when a tenant is evicted under Section 9 from an inam land, the institution holding the inam itself shall lease out the said inam land '

ఈభూములలో రైతులకువున్న హక్కు సందేహాస్పదమైనదని ఇదివరకే చెప్పాను ఆకారణంచేత తొలగింపబడిన రైతుకే భూమిని తిరిగి యివ్వాలనడం ఎంతవరకు వెళ్ళుతుంది

'So a right which is not given under Section 10 of the Act, cannot now be newly created by way of amendment to a Rule Therefore, I rule this also out of order and no more discussion on this will be allowed Let us go to the next point'

Form I

*Sri K Venkata Rao* It is a notice to be issued by the Tahsildar and not an information to be furnished by the tenant

అందువల్ల శ్రీ వెంకటేశ్వర్లుగారు ఇచ్చిన సవరణ అనవసరం

It is a notice to be issued by the Tahsildar and not an information furnished by the tenant Therefore it does not fit in there

I would refer him to Rule No 15 (2) Under that, a party can be assisted by a legal practitioner or by an authorised agent

It is clear under Rule 15 (2)

*Mr Speaker* Form I is a Notice Form to be given by the Tahsildar It says.

"Whereas it is proposed .. .

.

All persons and institutions claiming an interest in the said land are hereby required to file before the undersigned, a statement of particulars. "

So, I think hon Sri Venkateswarlu will agree that this amendment does not fit in with Form I Now let us go to the other Form

శ్రీ కె. వెంకటరావు He can be assisted by a legal representative or an authorised agent ఇది clear గా Rule 15 (a) లో ఉన్నది. కాబట్టి యిది Form No IX లో అనవసరం.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి అధ్యక్షా, 15 (2) లో ఒక proviso ఉన్నది "Provided that the Tahsildar, Revenue Court or Collector may, at any stage of the proceedings, and for reasons to be recorded in writing, cancel such permission" అంటే తహసిల్దారు గాని, కలెక్టరుగాని వారికి తోచిన కారణం వ్రాసి, ఆ permission రద్దుచేయవచ్చును.

(Interruption)

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు . అధ్యక్షా, మంత్రిగారు legal representative ఉండవచ్చునని, రూలు 15 (2) లో ఉన్నదని చెప్పారు. కాని దానికి ఒక

proviso ఉన్నది. అది ఏమంటే— తహసిల్దారు గాని, రెవిన్యూ కోర్టు గాని, కలెక్టరు గాని, proceedings యొక్క ఏ stage లో నైనా లిఖితపూర్వకంగా వ్రాసి, లీగల్ రిప్రెజెంటేటివ్‌ను పెట్టుకొనుటకు యిచ్చిన పర్మిషన్ రద్దుచేయవచ్చును ఇతర కోర్టులలో legal representative ను పెట్టుకొనుటకు ఎటువంటి అధికారం ఉన్నదో, అటువంటి అధికారం యీ సందర్భంలో కూడ యివ్వాలని మేము కోరుతున్నాము తహసిల్దారుకుగాని, మరి ఎవరికిగాని, ఏ స్టేజిలో నైనా legal representative ను తీసివేసే అధికారం ఉండకూడదు మా అనుభవాన్ని బట్టి తహసిల్దారు మీద నమ్మకం ఉంచలేకుండా ఉన్నాము అన్ని కేసులు టెనెంటుకు వ్యతిరేకం అవుతున్నాయి కాబట్టి తహసిల్దారు, కలెక్టరు గార్ల దయాధర్మం మీద ఆధారపడకుండా, legal representative చేత చివరివరకు కేసును నడిపించుకొనేందుకు అవకాశం ఉండాలని మా సవరణ ప్రతిపాదించాము

శ్రీ యస్ కె వి కృష్ణావతారం అధ్యక్షా, ఈ 15వ రూలుకు అడుగున ఉన్న proviso—

"Provided that the Tahsildar, Revenue Court, or Collector may at any stage of the proceedings, and for reasons to be recorded in writing, cancel such permission "

యిది అనవసరము redundant అవుతుంది రూలు 15 (2) లో may permit అని యున్నది. It sufficiently covers ఎందుకంటే permission ఇచ్చే వానికి తగ్గించే హక్కు ఎప్పుడూ ఉన్నది కొన్ని సందర్భాలలో extraneous reasons ఉంటే రద్దుచేయవచ్చును. కాని ఒకసారి legal representative కేసును తీసుకొని, కోర్టులో appear అయిన తరువాత అతనికి permission రద్దుచేయుట (ఏవైనా extra-ordinary reasons ఉంటే తప్ప) సామాన్యమైన విషయం కాదు.

*Mr Speaker* But here, the agent need not be a legal practitioner.

శ్రీ యస్ కె. వి కృష్ణావతారం ఈ proviso లేకుండానే ఏజంటును రద్దు చేయవచ్చును An authority which has got a power to do a particular thing, has always got the power to revoke that particular thing. It is implied in the Act.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, రూలు 15 (2) ను రెవిన్యూ మంత్రిగారు refer చేశారు తరువాత కృష్ణావతారంగారు వివరించిన తరువాత వివరం ఎక్కువగా తెలిసింది. ఏజంటు అన్నప్పుడు, ఆయన లాయరు అయితే

అది వేరేసంగతి ఆయనను తేలికగా తప్పించుటకు వీలు కాకపోవచ్చును లాయరైతే తనకు statutory హక్కు ఉన్నదని గట్టిగా చెప్పగలడు కాని లాయరుకాకుండా, యింకొకరెవరైనా ఏజంటుగా యుంటే, అతనిని తేలికగా తొలగించే అవకాశం ఉంటుంది కాబట్టి లాయరు కానటువంటి ఏజంటును పెట్టుకుంటే, అతను తహశీల్దారు, కలెక్టర్ల దయమీద ఆధారపడి యుండాలి కాబట్టి అతనికి protection లేకపోతే యిబ్బంది అవుతుంది అందువలన మంత్రి గారు బాగా ఆలోచించి యీ సవరణను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

శ్రీ కె వెంకటరావు ఈ అమెండ్ మెంటుకూ, మనము అనుకున్నదానికి సంబంధం లేదు Here, this amendment does not fit in at all, and there is no need రూలు 15 (2) క్రింద proviso వుండాలా లేదా అనే విషయం వేరు, independent గా చూడాలి నాకు యిప్పుడు అమెండ్ మెంట్ move చేసే అధికారం లేదు. కాని వారు యిచ్చిన అమెండ్ మెంట్ అనవసరం ఈ రూలు clear గా ఉన్నది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మంత్రిగారు అమెండ్ మెంట్ తెస్తే తీసుకురావచ్చుననుకుంటాను రూలు 15 (2) లో ఉన్న ఏర్పాటుకు, దాని క్రింద ఉన్న proviso వ్యతిరేకంగా ఉన్నది వారు దాదాపు అది concede చేస్తున్నారు ఇప్పుడు టెక్నికల్ యిబ్బంది ఏమంటే, ఆ విధంగా ఎవరూ ఎమెండ్ మెంట్ తీసుకురాలేదు కనుక, అది అవసరంలేదని, తరువాత చూచు కొనవచ్చునని అంటున్నారు కాని మంత్రిగారు అటువంటి అమెండ్ మెంట్ ను తీసుకువచ్చుటకు అవకాశం ఉన్నది కనుక, ఆ విధంగా యిప్పుడుతెస్తే, ఏమీ యిబ్బందిలేకుండా సర్దుకొనవచ్చును మేము కోరునది—ఏజంటుగా వెళ్ళిన వారిని తహశీల్దారు discretionery powers ఉపయోగించి వెళ్ళకుండా, అతనికి statutory right ఉండాలి ఆ విషయం మంత్రిగారు బాగా ఆలోచించి, యిప్పటికైనా ఆ విధంగా చేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను

శ్రీ కె వెంకటరావు వారి సవరణ యిక్కడ fit in కాదు "Either personally or by legal representative" వరకు అభ్యంతరం లేదు. కాని "assisted by two other persons" అంటే అర్థము లేదు. అసలు వారి అనుమానమేమంటే తహశీల్దారు తన powers ను అతిక్రమించి, proceedings మధ్యలో ఏజంటును తీసివేస్తారేమోనని, అది unnecessary worry అని యిప్పుడు జరుగుచున్న చర్చలో తేలినది అది తరువాత ఆలోచించి తీసుకొన వలసిన చర్య తీసుకొంటాము.

శ్రీ జి. యలమందారెడ్డి అధ్యక్షా, ఇంకొక సందేహం. మేము ప్రతిపాదించిన సవరణ, మంత్రిగారు fit in కాదన్నారు కాని రూలు 15 (2) లో ఉన్న proviso చాలా ప్రమాదమైనదని మంత్రిగారు గుర్తించారు కృష్ణావతారం గారు చెపుతూ—"may permit" అని ఉన్నది కాబట్టి withhold చేసే అధికారం కూడ అందులో imply అయియున్నదని, legal practitioner అయితే, ఆయనను తేలికగా తీసివేయుట సాధ్యంగాదని చెప్పారు అసలు విషయమేమంటే, టెనెంట్ తనకు అవసరమైనప్పుడు ఏజంటునుగాని, లాయరునుగాని పెట్టి వాదించుటకు, సంపూర్ణమైన హక్కు ఉండాలి ఆ సౌకర్యం టెనెంటుకు కలుగజేయుటకు ఏమి యిబ్బంది యున్నదో మాకు అర్థంకావటం లేదు వేలకు వేల ఎకరాలను తాశీల్దారు రెండు భాగాలో, మూడు భాగాలో చేసి decide చేయుటకు సంపూర్ణ అధికారం యిచ్చిన చట్టం, టెనెంట్ ఏజెంటును పెట్టుకొని వాదించుకొనుటకు అవకాశం కలుగజేయలేక పోతున్నదంటే చాలా విడ్డూరముగా ఉన్నదని మనవిచేస్తున్నాను టెనెంటుకు యిద్దరు assistants ఉంటే ఏమి చిక్కువస్తుంది ? మొత్తము భూమిని decide చేయుటకు తహశీల్దారుకు చట్టములో అధికారం యిస్తున్నప్పుడు, టెనెంటుకు యిద్దరు సహాయకులను పెట్టుకునేందుకు అవకాశం కల్పిస్తే ఉండే యిబ్బంది ఏమిటి ? ఇది 'fit in' కాదంటే ఎట్లా ? కాబట్టి యీ సవరణను ఆమోదించి ఇద్దరు వ్యక్తులను సహాయకులుగా పెట్టుకొనుటకు అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, వారు పెట్టిన సవరణ అనవసరము దానిని నేను అంగీకరించటం లేదు 15-2 లో ఉన్నటువంటి ప్రొవిజోను మార్చటం విషయమై ఆలోచిస్తాను

*Sri. S. Ranganatha Mudaliar*. Mr Speaker, Sir, I may be permitted to say a few words My submission is, this proviso (proviso to Rule 15 (2)) is necessary and it is complimentary to the other and foregoing part of the rule What the Rule says is "Provided that the Tahsildar, Revenue court, or Collector may, at any stage of the proceedings, and for reasons to be recorded in writing, cancel such permission The Tahsildar may not permit in the first instance

*Mr. Speaker* 'May' means 'shall'.

*Sri S. Ranganatha Mudaliar* · I may be permitted to say what I feel, Sir The rule says 'the Tahsildar may permit It is not 'shall'. The word 'may' in the first instance will not mean 'shall'. The Tahsildar may permit, in the first instance he need not permit,

and if he permits there is no harm, if he does not permit he will not be committing any error, if he permits he willl be doing it in exercise of the discretion and he is empowered under the Proviso to withdraw the permission So, I submit, the Rule must be left as it is, and any amendment cannot be in the nature of a concession because the Opposition party wants to be a bit clamerous in regard to the amendment There is no justification for the Treasury Bench to agree to the amendment by way of concession to the Opposition demands Therefore, I submit that the rule must remain as it is

*Mr Speaker* It is a thing done in the ordinary course 'May' means 'shall'

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, రంగనాథ మొదలియార్ గారు అపోజిషన్ వారు 'clamerous' గా ఉంటున్నారని అన్నారు వారు అపోజిషన్ వారు కాదా ?

మిస్టర్ స్పీకర్ Let us not go into all those things

*Sri S Ranganatha Mudaliar* If I have used any unparliamentary expression, I am willing to withdraw it, Sir I think 'clamerous' is not unparliamentary.

శ్రీ పి సుందరయ్య · అధ్యక్షా, రైతు తన తరఫున వాదించుకొనడానికి, లీగల్ రిప్రజెంటేటివ్ నుగాని, ఏజంట్ నుగాని రానివ్వాలని ముందు అన్నారు కాని అతనిని ఏ కారణంచేతనైనా త్రిప్పి పంపించవచ్చును. కాబట్టి ఈ ప్రోవిజో అనవసరము ఈ రూలులో యీ ప్రోవిజో తీసేసి "he shall permit" అని ఒక మేండేట్ యివ్వాలి. కొన్ని కొన్ని సందర్భాలలో may అన్నదాంట్లో shall అనే force ఉన్నా, యీ rule-making లో he shall permit అని categorical గా చెప్పడం అవసరము, తలతిక్క ఉన్న ఏ తహశీల్ దారైనా, ఏజంట్ నుగాని, లీగల్ రిప్రజంటేటివ్ నుగాని రానివ్వకుండా చేయటానికి తావు ఇవ్వకూడదు. మంత్రిగారు టెక్నికల్ పాయింట్సు కాకుండా, మీ పర్మిషన్ తో కొన్ని వెర్బల్ ఛేంజెస్ చేసేదానికి అవకాశము ఉన్నది కాబట్టి, మంత్రిగారు, దానిని ఇక్కడే సవరిస్తే సరిపోతుంది ఆ విధంగా మంత్రిగారు చేయవలసిందిగా కోరుతున్నాను.

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఇవన్నీ లీగల్ మేటర్స్ అవి 'on the floor of the House' చేయటానికి వీలులేదు వారి ఆర్గ్యుమెంటులో ఉన్న బలాన్ని గుర్తించే, దానిని నేను అంగీకరించాను దానిని గురించి నేను ఆలోచిస్తాను లీగల్ రిప్రజెంటేటివ్ లేకుండా, ఏజంట్ లేకుండా, వేలుముద్ర వేసే రైతును బాధపెట్టటం ప్రభుత్వ ఉద్దేశం కాదు సభ్యులు ఆంధ్రా టెనన్సీ యాక్టు గురించి చెప్పారు ఆ యాక్టులో ఇలాంటి similar rule ఉంది ఆ యాక్టు అసెంబ్లీలో పెట్టినపుడు, దీనినిగురించి ఎవరూ మాట్లాడలేదు అది అక్కడ ఉండటంవల్ల దీంట్లోకూడా వచ్చింది అసలు అవసరమైనచోట సభ్యులు object చేయలేదు. నిజంగా అక్కడ చాలా అవసరమైనది కాని, ఇక్కడ ఇది చాలా లిమిటెడ్ వ్యవహారం

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అప్పటి అనుభవంతో, అప్పుడు పడిన బాధలవల్ల నే చెబుతున్నాము

శ్రీ కె వెంకటరావు. అందుచేత రెండుచోట్ల తీసివేయాలో, ఒకచోట తీసివేయాలో, ఏమి చేయాలో ఆలోచించి చేస్తాను సభ్యులు చెప్పినది నాకు అర్థం అయింది వారు చెప్పిన విషయం ఆలోచిస్తానని చెబుతున్నాను

*Mr. Speaker* Rule 15 (1) reads 'All proceedings before the Tahsildar, the Revenue Court, or the Collector under the Act, shall be summary and shall be governed, as far as may be, by the provisions of the Code of Civil Procedure'

*Sri Pillalamarri Venkateswarlu* Sir, I beg leave of the House to withdraw my amendment

The amendment was, by leave of the House withdrawn.

## THE ANDHRA (INAM) TENANTS RESTORATION TO POSSESSION RULES

### *Rule* 5

శ్రీ కె వెంకటరావు. అధ్యక్షా, ఈ 1, 2, 3, 4 అనేవి manner of service of notice ను determine చేసేవి అసలు ఆ period అయిపోయింది అయినప్పటికినీ ప్రభుత్వము తనకు ఉన్న special powers క్రింద instructions యివ్వడముఅయింది ఏవిధమైన సర్వీసుకూడ ఎక్కడైనా చేయకపోతే, ఆ పిటిషను దగ్గరపెట్టుకుని దానిని విచారించితీరాలి అనే నిర్ణయముచేసి, దానికి సంబంధించిన Revenue Courts అన్నింటికిగూడ communicate చేయడము జరిగింది. అందువల్ల ఇది ఏమీ అవసరములేదని అనుకుంటున్నాను.

అప్పుడు అసలు యీ విధముగ నోటీసు యివ్వాలని లేదు ఒక వేళ నోటీసు యివ్వకపోయినను, ఆ claim ను గురించి proceed కావలసిందే, అనే నిర్ణయం ప్రభుత్వము చేసిందిగనుక, యీ 1, 2, 3, 4 అనేవి ఏవీ అవసరము లేదని నా మనవి

శ్రీ జి. యలమందారెడ్డి Instructions ఇచ్చామని అంటున్నారు కాని దానికి clarification అవసరమని మంత్రిగారిని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు దానికి clarification అవసరము లేదనుకుంటాను అయినను ఒకసారి చదువుతాను

"Whereas under sub-section (4) of section 8 of the said Act, every notice under sub-section (2) shall be served in such manner as may be prescribed in the rules made under the Section ,

And whereas the rules were not made under section 13 of the said Act within six months from the commencement of the said Act, and a difficulty has thus arisen in giving effect to the provisions of sub-section (2) of section 8 of the Act also ,

Now, therefore, in exercise of the powers conferred by section 14 of the said Act, the Governor of Andhra Pradesh hereby directs that revenue courts specified in section 8 of the Act be authorised to receive applications made to them under sub-section (2) of section 8 of the Act, even though the notice has not been served on the landholder by the persons entitled to be restored to possession as provided in sub-section (1) of section 8 of the Act "

అందువల్ల ఇది clear గానే ఉన్నది. గవర్నరుగారు యీ రూలును approve చేసిన తరువాతనే పబ్లిషు చేశాము. Landholder కు ఏ విధమైనటు వంటి నోటీసు ఇవ్వవలసిన అవసరము లేకుండానే, వారి applications అన్నీ consider చేయబడుతాయి గనుక, యీ 1, 2, 3, 4, అనవసరమని అంటున్నాను.

*Rule* 8

*Sri Pillalamarri Venkateswarlu* Mr. Speaker, Sir, I beg to move

"In Rule 8 in line 2, for the word 'two', substitute the word 'four'."

*Mr Speaker* Motion moved

శ్రీ కె వెంకటరావు ఇది ఒప్పుకుంటే tenants కే ఎక్కువ కష్టము ఉంటుందండి Landholder కు కాదు నాలుగు నెలలు అంటే ఇదివరకు ఉన్న 1948 వ సంవత్సరపు వ్యవహారమే కదా !

'The landholder will continue in possession and the tenant will not get possession of it unless he takes advantage of this rule'

ఇప్పుడు tenant కు రెండు నెలలు పెట్టడములో ఉద్దేశము ఏమిటంటే landlord possession లో యీ భూమి ఉండకుండా చేయటానికే తప్ప మరొకటి ఏమీ కాదు

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, మంత్రిగారి వాదన బాగానే ఉన్నది కాని ఏదో పొరబాటువల్లనో, లేక డబ్బు లేకనో, ఏదో చిక్కువల్ల, లేక యీ వ్యవహారము యీవిధముగ చేయాలని తెలియకనో ఆ పెట్టుకోవలసిన పిటిషనును రైతు పెట్టుకోలేక పోతాడు అందువల్ల ఆ రెండు నెలల కాలము చాలకపోతుంది రెండు నెలలు కాకపోతే, 15 రోజులలోనే పెట్టుకోవచ్చు పిటిషను పెట్టుకున్న తరువాతనైనా, పైన ఉన్న Revenue Court ఆ land possession యిస్తుందో లేదో ఆ సంగతి వేరు కాని దురదృష్టవశాత్తు ఆయన application పెట్టుకో లేకపోతే, అప్పుడు ఆ భూమిమీద హక్కే పోతుంది చివరకు అప్పీలు చేసుకునే హక్కు కూడ పోతుంది. అతను రెండునెలలలో application పెట్టుకోలేకపోయినప్పటికినీ, ఆ application తరువాత పెట్టుకున్నాడని దానిని invalid చేయవచ్చు అట్లా invalid చేయకుండ ఉండటానికి కనీసము నాలుగు నెలలైనా టైము యివ్వాలని అడుగుతున్నప్పుడు, అతనికే నష్టము వస్తుందని అంటారు ఎందుకు ? నాలుగు నెలలలో పెట్టుకోవచ్చునని ఇందులో ఉంటే, అతను రెండురోజులలోనే పెట్టుకోవచ్చు, లేదా మూడవ రోజునే పెట్టుకోవచ్చు, లేకపోతే ఒకటి రెండు వారములలో పెట్టుకోవచ్చు, మూడు వారములలో పెట్టుకో గలిగితే పెట్టుకోవచ్చు. అతనికి నాలుగు నెలల దాకా టైము ఉంటుందిగనుక, ఈ లోగా ఎప్పుడైనా బాగా విచారించుకొని application పెట్టుకోటానికి తగినంత వ్యవధి ఉంటుంది. అతనికి భూమి వెంటనేకావాలని అంటే, వెంటనే పిటిషను పెట్టుకుంటాడు. అతనికి ఈ రూల్సు అన్ని తెలియకపోవచ్చు, ఇది అంతా విచారించుకోటానికి అవసరమైనంత టైము ఇవ్వడము న్యాయము. ఒకవేళ ఏదైనా, అతనిశక్తికి మించినఇబ్బందులు కలగవచ్చు, లేదా ఏదైనా జబ్బు రావచ్చు, లేదా ప్లీడరును విచారించుకోటానికి

తగినడబ్బు కాగితాలు, వగైరాలు ఏర్పాటు చేసుకోడానికి వీలు కాకపోవచ్చు అందువల్ల "నాలుగు నెలలదాకా టైము యివ్వమని అడిగితే, అతనికే నష్టము వస్తుంది అందువల్ల అది వీలులేదు" అని చెప్పడము ఏరకముగాను న్యాయమైన విధానము కాదు ఎక్కువ వ్యవధి లేకుండా చేయడము Tenant కు నష్టపరచడముతప్ప మరేమి కన్పించదు అందువల్ల అతనికి కావలసినంత అవకాశము కలుగజేయటానికే మేము నాలుగు నెలలు ఇవ్వమని సవరణ తెచ్చాము వాళ్ళకు యివ్వకూడదనే వాదన తప్పితే, మంత్రిగారు దీనికి ఒప్పుకోకపోవడము న్యాయముకాదు 4 నెలలు కాలవ్యవధి ఇస్తే, అతనికి ఏవిధముగాను నష్టము లేదుగనుక ఈ సవరణ అంగీకరించమని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు దీనికి రాజీ చేద్దాము

మిస్టర్ స్పీకర్ మంత్రిగారు ఆలోచిస్తున్నారు

శ్రీ కె వెంకటరావు దీనికి ఆలోచన ఏమీ లేదండి మూడు నెలలు ఉంటే సరిపోతుంది గనుక మూడు నెలలు చేయటానికి ఒప్పుకుంటున్నాను

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు నా సవరణలో 3 నెలలు అనే సవరణ చేయవలెనని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ All right మంత్రిగారు మూడు నెలలకు ఒప్పుకున్నారు. కనుక వెంకటేశ్వర్లుగారి amendment ను 3 నెలలకు సవరించి ఓటుకు పెడుతున్నాను.

The question is

"In Rule 8 in line 2, for the word 'two', substitute the word 'three.'"

The motion was adopted.

*Mr Speaker*. The question is

"That Rule 8, as amended, be approved."

The motion was adopted.

Rule 8, as amended, was approved

*Rule* 10

*Sri Pillalamarri Venkateswarlu*: Mr. Speaker, Sir, I beg to move:

"Add the following as new Rule 10,

"10 No application under these Rules for possession shall be dismissed on technical grounds "

*Mr. Speaker* Motion moved

Technical ground మీద dismiss చేయడమనేది ఏ jurisprudence లో కూడ ఉండదు అది వ్రాసినవారు అనుకోవడం form లో లోపాలు ఉన్నవని కాదు Limitation also is a Technical ground

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, ఇప్పుడు మీరు రూలింగు ఇచ్చే ముందు దీనికి మా అభిప్రాయాలుకూడ తెలుసుకోవలసి ఉన్నది Technical ground అంటే దేనికైనా limitation పెట్టితే కొట్టివేయకూడదా, నూరు సంవత్సరాలు అయినా కొట్టివేయకూడదా అనేది సమస్యకాదు ఏదైనా heredity విషయములో అయితే Hindu Law లో ఉన్నవి అన్ని తీసుకునివచ్చి దీనికి apply చేయటానికి ఆలోచిస్తే ప్రయోజనము లేదు ఇలాంటి ప్రత్యేక విషయాలకు సంబంధించిన వాటికి కాదు దీనికి సంబంధించిన రూల్సు ఉన్నవి దీని విషయములో technical ground మీద కొట్టివేశారని మంత్రిగారి వద్దకు కొన్ని వందల petitions యీ పాటికి వచ్చి ఉంటాయి అలాంటివి అన్నీ technical grounds మీదనే కొట్టివేశారు ఏవేవి అయితే technical grounds మీద కొట్టివేశారో వాటికి ప్రత్యేకంగా రూల్సు పెట్టి, అవి ఆ విధంగా కొట్టి వేయకుండా Tenants కు protection ఇవ్వాలని మేము అడుగుతున్నాము దానికి Technical grounds అంటే, limitation పట్టినప్పటికైనా సరే, అది ఏ jurisprudence లో కూడా లేదు అన్నా, నిజానికి మిగిలిన చోట్లలో రైతులు చాలామంది యిబ్బంది పడుతున్నారు కొన్ని చోట్లలో యిబ్బందులు లేకపోవచ్చు, అయితే రైతుకు protection యివ్వవలసిన అవసరము మనమీద ఉన్నది కోర్టులమాదిరి యిక్కడ మనము వ్యవహరించడము లేదు మనము దీనిని శాసనము చేసిన తరువాత అలాంటివి interpret చేయడము కోర్టుల యొక్క duty మనము ప్రజలకు, రైతులకు ప్రతినిధులముగ ఇక్కడ ఉన్నాము గనుక, వాళ్ళయొక్క హక్కులు కాపాడడము అనేది, దానికి తగిన శాసనము చేయడము అనేది మనయొక్క కర్తవ్యము ఒకవేళ Law of Jurisprudence లో ఏమివ్రాసి ఉన్నదో, అది యిందులో లేకపోవచ్చు అందువల్ల అవి అన్నీ మార్చవలసిన అవసరము వస్తే రావచ్చు కాని ఇప్పుడు మనము రైతులను రక్షించవలసిన సమయములో legal aspect లో పూర్తిగా అది Law of Jurisprudence క్రిందకు రావడానికికూడ మనము ఆలోచించవలసి ఉన్నది మనము దీనిని ప్యాసు చేసిన తరువాత అది సవరించవలసిన అవసరము వస్తే, సవరించవలసి ఉన్నది, సవరించవచ్చు అందువల్ల మంత్రిగారి

వద్దకు వచ్చిన petitions అన్నీ దృష్టిలో పెట్టుకుని, ఇంతవరకు technical grounds మీదనే వాటిని కొట్టివేశారు గనుక, Tenants Act క్రింద వీటికిగూడ ఆ గతి పట్టకుండా చేయాలని నా అభిప్రాయము."

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) అధ్యక్షా, కేవలం technical grounds మీద కొట్టివేసిన కేసులుఅన్నీ మంత్రిగారి దృష్టికి ఇదివరకే తీసుకునిరావడమైనది ఏ ఏ కారణములవల్ల ఇవి technical grounds అని కొట్టివేశారంటే, రైతు భూస్వామికి స్వయంగ ఇవ్వకుండా తహశీలుదారుగారిద్వారా నోటీసు అందజేస్తే, స్వయముగ ఇవ్వలేదు కనుక దీనిని కొట్టివేస్తున్నామని అన్నారు ఇలాంటి ఘటనలు చాలా ఉన్నవి తహశీలుదారు ద్వారా ఇస్తే మంచిదని. రేపు పొద్దున నాకు యివ్వలేదని భూస్వామి తప్పించుకోవచ్చు అందువల్ల స్వయముగ నోటీసు ఇవ్వలేదుగనుక కొట్టివెశామని అంటే, అంత మాత్రముచేత technical ground ఎట్లా అవుతుంది? కాబట్టి ఇలాంటివి ఈ విధముగ dispose of చేస్తూ భూస్వామికే సహాయము చేసినట్లు అయింది. తరువాత ఇంకొక ground మీద కొట్టివేశారు కౌలు ధాన్యము అంతా, అంటే చేలో పండినదంతా కూడ తీసుకునివచ్చి చూపించలేదట. ఇలాంటి కారణాలచేత కొట్టివేసిన కేసులు ఎన్నో వున్నవి. ఇప్పుడు వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు ఈ విషయములో ప్రభుత్వోద్యోగస్థులు అవలంబించే విధానము చట్టమునకు విరుద్ధముగ ఉన్నది దీనిని ఇంకొక విధముగ ఆలోచించనవసరములేదు. చట్టములో ఉపయోగించిన భాషనే వేరుగ interpret చేసి ఈ విధముగ జరుపుతున్నారు ఇందాక చర్చ జరిగినట్లుగా "may" కు "shall" అని, "may" అని అర్థము తెచ్చి, రైతుకు వ్యతిరేకముగాను, భూస్వామికే సహాయపడేటట్లు ఈ పిటిషనులు అన్నీ ఏదోకారణము చూపించి కొట్టివేయడము జరుగుతున్నది గనుక, ఈ విషయములో మంత్రిగారు పునరాలోచించి తగిన instructions ఇస్తారని ఆశిస్తున్నాను

శ్రీ జి యలమందారెడ్డి అధ్యక్షా, ఇప్పుడు ఈ విషయములో నేను ఒక్క అభిప్రాయమును మంత్రిగారికి మనవి చేయదలచాను అది చట్టము విషయము కాదు-అనుకోండి ఒకసారి ఒకచట్టము చేసిన తరువాత ఆ చట్టమును జయప్రదముగ ఎట్లా అమలు జరపాలి అనే సందర్భములో ప్రభుత్వము కొన్ని రూల్సు కూడ చేయడము జరుగుతున్నది ఆ రూల్సును అమలు జరపడంలో ప్రభుత్వముయొక్క ముఖ్యోద్దేశ్యము నెరవేరడంలేదు. ఇంతవరకు కొట్టివేసిన కేసులన్నీ చాలామట్టుకు technical ground మీదనే కొట్టివేశారు. technical grounds అనేవి న్యాయమైనవి అవునా కాదా అనే విచక్షణతో

కూడ చూడాలి ఈ విషయములో నేను ఒక ఉదాహరణ చెబుతున్నాను మన మందరము Elections సందర్భములో nominations వేస్తున్నాము అందులో క్రొన్ని invalid అని కొట్టివేయడము కూడ ఉన్నది ఈ విషయము మనకు అందరికి తెలుసు ఈ మాదిరిగ ఏదో మిషమీద నామినేషన్ కొట్టివేస్తున్నారు, అని Election Commission కు తెలుపడమువల్ల technical grounds అనేవి frivolous గా ఉండకూడదని Presiding Officers కు Election Commission వారు instructions ఇవ్వడం జరిగింది ఇప్పుడు నేను కొత్తగా చెప్పుతున్న విషయము కాదిది Legal practices లో లేనటువంటిది కొత్తగా ఏమీచేర్చలేదు అందువల్ల Election Commission వారు Presiding Officers technica grounds మీద, frivolous కారణములు చూపించి కొట్టివేయకూడదు ఇక్కడ comma లేదని, ఇక్కడ fullstop లేదని, లేకపోతే గడియారము లోని టైముకు అరగంట ముందుగ ఇవ్వలేదని, ఇలాంటివి కాకుండా substantial ground ఏదైనా ఉంటేతప్ప కొట్టివేయకూడదు అన్నారు అందులో కేవలము mechanical గా, ఏదోఒక frivolous reason చూపించి కొట్టివేయవద్దు అని ఖచ్చితముగా చెప్పినమాట మన కందరికీ తెలుసు కాబట్టి అదేవిధముగ భూస్వాములకు సహాయము చేసేరూపములో, రైతుకు అన్యాయము జరుగుతున్నదే, మనము చేసేది న్యాయము అవునా కాదా అనే విచక్షణ లేకుండా ఈ పిటిషనులు కొట్టివేయకుండా ఉద్యోగస్థులకు instuctions ఇవ్వాలని అంటున్నాను భూస్వాములు తమ యొక్క influence ఉపయోగించి పిటిషనులు కొట్టివేయించడముకూడ సహజముగ జరుగుతుంది కేవలము technical ground అని కాకుండా కొట్టివేయడము న్యాయము కాదు దీనికి ఒక convention ఉన్నది సాధ్యమైనంతవరకు ఈ పిటిషనులు కొట్టివేయకుండ న్యాయాన్యాయములు సక్రమముగ విచారించి dispose చేయమని instruction ఇస్తే బాగాఉంటుందని మంత్రిగారికి మనవిచేస్తున్నాను

శ్రీ కె. వెంకటరావు ఇది ఎంతమాత్రమూ accept చేయడానికి వీలులేదు. Technical grounds అనేపదం ఎక్కడా define కాలేదు. Technical grounds మీద కొట్టివేయవద్దు అనేది bar అవవచ్చు Act లో వున్న grounds అన్నీ statutory grounds గా వున్నాయి. ఈ statutory grounds వల్ల ఏదయినా నష్టంవుంటే statute ను మార్చుకోవాలిగాని దానిని కాదని ఏ చర్యతీసుకొన డానికి ఏ విధంగానూ వీలులేదు ఇష్టంవచ్చినప్పుడు petition పెట్టుకోవచ్చు, ఆ పెట్టినటువంటి petition అవతలవాళ్ళకు notice యిచ్చినా యివ్వకపోయినా చెల్లాలి యీ petition లో వారేమి వ్రాయాల్సినది వ్రాయకపోయినా చెల్లాలి ఈ విషయాలన్నీ లెక్కలోకి తీసుకోకూడదు అని మొట్టమొదట

శాసనం చేసివుండి, tenants కు extra privileges యిచ్చివున్నట్లయితే యీ technical అనేముక్క వస్తుంది గాని, లేకపోతే రాదు లేకపోతే ఇవ్వాళ మిత్రులదగ్గరనుంచి ఆ complaints తీసుకుని అయిదుగురు జిల్లా కలెక్టర్లను ఒక చోటచేర్చి ఆ cases ను examine చేస్తే statutory grounds మీద 99% కేసులు కొట్టేశారు ఎక్కడో ఒకటి, రెండు technical grounds మీద కొట్టేసి వుండవచ్చు Technical అనేముక్క statutory అవునా కాదా అని అనుకోకపోవడం వల్ల తగవువచ్చి, అది కష్టమని తోచవచ్చు Notice యివ్వమని దీంట్లో వుంది ఇవ్వలేదు గనుక కొట్టేశారు Notice యివ్వవలసిన అవసరంలేదని statute పెట్టుకోవాలి కొట్టేయడం statutory grounds వల్లగాని technical grounds వల్ల కాదు. అది దానిలోని distinction, అది statute లో వేసిన provision క్రింద కొట్టేశారు అది తప్పుఅయితే అంతకంటే liberal గా చర్చించదలచుకుంటే statute లో amendment రావాలిగాని technical grounds మీద ఎవరూ కొట్టి వేయకూడదని direction చేయరాదు ఏమయినప్పటికీ యీ రకంగా దానికి restriction పెట్టే అధికారం మనకులేదు అని నా నమ్మకం అందుచేత యీ సవరణను accept చేయడానికి వీలులేదు

*Mr Speaker* The question is

"Add the following as new Rule 10

"10 No application under these rules for possession shall be dismissed on technical grounds "

The motion was negatived.

*Sri Pillalamarri Venkateswarlu:* I demand a division, Sir

The House then divided

Ayes : 32 — Noes . 56

The motion was negatived

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ : దీంతో అన్నీ ముగిసినవి. ముఖ్యమంత్రిగారు యివ్వాళే ఊరునుండి వచ్చారు. వారికి వీలులేనందున Ad Hoc Committee శిఫార్సు చేసిన Assembly Rules ను వచ్చే సమావేశములో తీసుకుందాము

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఆ రూల్సు తీసుకోవలసిన అవసరం లేదు కాని ప్రశ్నలను గురించి తమ Chamber లో కూడాచెప్పాను Prorogue కావటానికి ముందు వచ్చిన ప్రశ్నలు 150 వరకూ వున్నాయని తెలుస్తున్నది అవి యిప్పటికే 6 నెలలో, సంవత్సరమో దాటిపోయి క్రొత్త ప్రశ్నలు రానీయకుండా అడ్డుపడి కూర్చున్నవి వచ్చినంతవరకు రేపు answer చేయడం జరుగుతుంది. మిగిలినవి Table మీద పెట్టి publish చేసే రకంగా ruling ఇస్తే క్రొత్త ప్రశ్నలు రావడానికి అవకాశం వుంటుంది

మిస్టర్ స్పీకర్ నేను మీతో ఏకీభవిస్తున్నాను రేపు ఉదయాన answer అయిన ప్రశ్నలు పోగా మిగిలినవి publish అవుతవి Prorogation కు పూర్వం వచ్చిన answer లను మళ్ళా రావడం ఎందుకని ఆపాము దరిమిలా వచ్చినవి బోతెకున్నాయి అవి చూచుకుందాం ఎవరికీ objection ఉండదనుకుంటాను.

శ్రీ కె వెంకటరావు అవి అచ్చువేయించి అందరికీ పంపించడానికి ప్రభుత్వానికి కూడ ఏ విధమైన అభ్యంతరము లేదు

మిస్టర్ స్పీకర్ రేపు ఉదయం 8-30 గంటలవరకు యీ సమావేశం వాయిదా వేయడమయినది

*The House then adjourned till Half Past Eight of the Clock on Friday, the 22nd November 1957*